# సంకీర్తనామృతము.

"జై, జై, గౌరాంగ కృష్ణ"

"జై, జై, చైతన్య కృష్ణ"



గౌరాంగ స...

విన్నకోట ...

దయచేసి పుస్తకములు ఉ...

# సంకీర్తనామృతము.

"జై, జై, గౌరాంగ కృష్ణ"

"జై, జై, చైతన్య కృష్ణ"



గౌరాంగ పాదసేవి,

చిన్నకోట వెంకటరత్నశర్మ.

దయచేసి పుస్తకములు ఉచితముగా పుచ్చుకొనవలదు.

# రాబోవు గ్రంథములు.

శ్రీకృష్ణ చైతన్యావతారము (వచనము)

బాలకాండము

యౌవనకాండము

సంకీర్తన కాండము

సత్యాగ్రహ కాండము

యోగకాండము

సన్యాసయోగ కాండము

నిర్మాణకాండము

నగర సంకీర్తనము

భగవత్సాక్షాత్కారము

భగవత్ప్రార్థనలు

భగవద్గీతామృతము

కర్మకాండము

సంకీర్తన కాండము

జ్ఞానకాండము

# సంకీర్తనామృతము.

"సర్వోపనిషదోగావో, దోగ్ధా గోపాలనందనః
పార్థోవత్సః సుధీర్భోక్తా దుగ్ధంగీతామృతం మహత్."

1. ఋషీశ్వరు లనేకులు, తమతమ అనుభవంబు లన్నియు నుపనిషత్తుల రూపంబున లోకంబున వెదజల్లిరి. అట్టి ఉపనిషత్తులు 1008 గలవు. అందు ముఖ్యముగా వాడుకలో నున్నవి 108. అందును ముఖ్యమని 12 ఉపనిషత్తుల పారాయణ సాధ్యములని, నిరూపించిరి. కొన్ని ఉపనిషత్తులు ద్వైతపరమనియు, కొన్ని అద్వైతపరమనియు, కొన్ని విశిష్టాద్వైతపరమనియు పెద్దలు వక్కాణింతురు.

"అచతుర్వదనో బ్రహ్మ, ద్విబాహు రపరోహరిః,
అఫాలలోచన శ్శంభుః, భగవాన్ బాదరాయణః."

అనగా బ్రహ్మదేవుడు ఒక్క మొగముతోడను, విష్ణుమూర్తి రెండు బాహువులతోడను, పరమశివుడు రెండు కన్నులతోను ఈ లోకమున వ్యాసావతారమై వచ్చినట్లు తెలియుచున్నది. అట్టి వ్యాసభగవానులు ఉపనిషత్తులన్నియు గోవుతో పోల్చిరి. ఉపనిషత్తులు సత్వగుణ ప్రధానములైనవి. గోవు జంతువులలో పరమసాత్విక నిధానము. ఇపుడు ఉపనిషత్తు లనుగోవును పాలుపితుకువాడు కావల

యును. అందుల కెవ్వరు సమర్థులు ? ఉపనిషదార్థములు సంపూర్ణముగా గ్రహించినవాడు కావలయును.

2. ఈ కారణముచేత వ్యాసభగవానులు, భగవానులును, ఉపనిషదార్థ ప్రదిపాదకుడును, తానవతారపురుషుడనని నొక్కి వక్కాణించినవాడునగు గోపాలకృష్ణ పరబ్రహ్మమూర్తినే, పాలు పితుకువాడుగా వర్ణించెను. సరే - ఆవు - ఉపనిషత్తులు, జ్ఞానమను పాలు పితుకువాడు, గొల్లవాడల సంచరించిన కొంటెగాడు. దూడను చేపనిదే, ఆవు పాలీయదుగదా ? ఇక్కడ దూడ స్థానము నాక్రమింపగలవాడెవ్వడు ? అంత భాగ్యశాలి దివ్యనామాక్షరము లెవ్వి ? ఎవ్వడు బాల్యమాది కృష్ణపరమాత్మతో కలసి మెలసి చరించెనో, ఎవ్వడు భగవంతునితో బాంధవ్యము కల్పించుకొనుటకై సుభద్రను వరించెనో, భగవానులు పరీక్షార్థమై "నేనొక్కడ నొక్కదెస, చక్రము పట్టను, తోచిన సహాయము చేయుదును, 10000 యాదవులు, గొప్ప విలుకాండ్రు, యుద్ధవీరులు మఱొక్కదెస, నీయిష్టము వచ్చినవారిని కోరుకొమ్మన, అనగా, భగవంతుడు నీకు గావలెనా ? లేక భగవదేతరము కావలెనా ? అన, ఎవ్వడు భగవానులనే కోరుకొనెనో, అట్టి అర్జునుని దూడగా నేర్పరచి వర్ణించె.

3. బాగున్నది. కావలసిన పాలు దూడ త్రాగినది. తదుపరి కృష్ణుడు పాలుపితికెను. ఆ పాలనగానేమి? భగవద్గీతామృతము.ఎవ్వరి నిమిత్తమై పితికెను? లోకము నిమి

త్తమే! కావున జన్మమెత్తినందులకు గీతామృతము గ్రోలుటయే చేయవలసినపని! ఆ పని నెవ్వరు చేయుచున్నారు? బుద్ధిమంతులందరు చేయుచున్నారు. కావున కృష్ణ భగవానులు ఉపనిషత్తుల సారమంతయు భగవద్గీతా రూపముగా షుమారు రెండు గంటల కాలములో యుద్ధప్రవేశమున అర్జునున కుపదేశించెను. ఆ భావములనే 701 శ్లోకములలో వ్యాసమహర్షి పొందుపరచెను.

4. నానాటికి ప్రజలు ఆ జ్ఞానమును మఱచిరి. ఆ గ్రంథ రత్నమును మఱచిరి. ఆచరణ సంపూర్ణముగా మానిరి. ఎక్కడనో ఒక రిర్వురు మహానుభావు లర్థగ్రాహ్యము చేసుకొనుచున్నను, అనుభవములో పెట్టుకొనలేక పోయిరి. కారణమేమనగా, చక్కగా నాచరించిన మహానుభావుడు మార్గదర్శకుడై లేకపోవుటయే. భగవానులు కరుణాసముద్రుడు. తాని ట్లాలోచించుకొనెను. "అయ్యో! చక్కని గీతాశాస్త్రమును లోకమున కిచ్చితినే కాని అందు చెప్పబడిన ట్లాచరించి, ఆనంద మనుభవించువారు లేరే! ఇంక నా గ్రంథము వలన పనియేమున్నది? కావున నేనే మనుష్యులమధ్య నవతరించి, వారితో కలసిమెలసి తిరిగి, గీతలలో చెప్పబడిన ప్రకార మనుష్టానముచేసి ప్రజలకు మార్గదర్శకుడ నయ్యెదను. అప్పుడు నా నడవడిక ప్రకారము వారును చేసి, నా సన్నిధానమున చేరుదురుగాక" అని యోచించి గంగానదీ తీరమున నవద్వీప పట్టణమున చైతన్య దేవుడై అవతరించి, ముముక్షువువలె అనుష్టానము చేసి, మన కందఱకును మార్గదర్శకు డయ్యెను.

5. ఎప్పుడు? నాల్గుతరముల క్రిందటనే ఏవంశమున? బ్రాహ్మణవంశమున? ఏ రూపమున దివ్యసుందర విగ్రహుడై గౌరాంగ రూపమున! తల్లి దండ్రు లెవరు? శచీ జగన్నాథులు! ఎట్లున్నాడు? మనవలెనే గృహస్థాశ్రమమున! ఎప్పుడు అట్లే ఉండెనా? లేదు 23 సంవత్సరమున సన్యసించెను! ఎవరి నిమిత్తమై? పాపుల నిమిత్తమై! ఆయనచేసిన ఘనకార్యము లేమి? ప్రజలు భగవంతుని సన్నిధానమున చేరుటకై, (అనగా మరల, మలమూత్ర భూయిష్ఠమగు మాతృగర్భమున బడకుండుటకై) కృష్ణప్రేమయే మూలకారణమని తాను, స్వయముగా, ఆ యా అవస్థా విశేషంబుల ననుభవించి చూపించెను. భగవంతునికి పేరుగాని, యూరుగాని, ఆకారముగాని లేదుగదా! వానిని ధ్యానించుటెట్లు? అట్లుకాదోయి, భగవంతుడు నిర్గుణుడైనను, నిరంజనుడైనను, నిరాకారుడైనను, భక్తుల నుద్ధరించు నిమిత్తమై, భక్తుల వాక్యముల నిశ్చయము చేయుటకై భక్తుల కభీష్టంబగు నామరూపక్రియలతో విరాజిల్లుచుండును. అదిగాక భగవంతునికి సాకార నిరాకారములు రెండును గలవోయి. మంచుగడ్డ, నీరు, ఒకటే పదార్థమే కదా. నీరుగానున్నపు డాకారము లేదు. మంచుగడ్డగానున్నపుడు తెల్లని రంగును, గుండ్రమో, పొడుగో గల రూపును ఏర్పడుచున్నవి. కరిగిన నేయి చూడుము. ఆకారమేలేదు. ఎందులోపోసిన నట్టి ఆకారమే పొందును. పేరిన నేయి చూడుము. తెల్లని రంగును, గడ్డాకారమును ఏర్పడును.

6. అట్లే భగవంతుడును తన యిచ్చవచ్చిన ఆకార ముతో, తన యిచ్చవచ్చినచోట, తన యిచ్చవచ్చిన కాలమున నవతరించి, చేతనోద్ధరణ మొనర్చి, తన యిచ్చవచ్చినట్లు నిర్యాణమొందును. అందువలననే ఆయన స్వతంత్రుడు. మనము అస్వతంత్రులము. భగవదారాధన గురించి శ్రీకృష్ణ భగవానులు భగవద్గీతలో నిట్లు చెప్పియున్నారు.

శ్లో॥ క్లేశోధికతర స్తేషాం అవ్యక్తాసక్త చేతసాం।
అవ్యక్తా హిగతిర్దుఃఖం దేహవద్భిర వాప్యతే॥

నిర్గుణ తత్వమును ధ్యానించువారికి కష్టములు హెచ్చుగా గలుగును. వారి ధ్యానమునకు ఫలితము దుఃఖమేయగును. అందును శరీరధారులకు బొత్తిగా నిర్గుణారాధన కష్టమేయగును. అనినందువలన ముముక్షువగువాడు భగవంతుని అవతార విశేషములలో తనమనస్సాకర్షించుదానిని గైకొని, ఆ నామమునే యుచ్చరించుచు, ఆచర్యలనే తలచుకొనుచు, తద్రూపమగు సపర్యలనే చేయుచు, తద్గుణములనే అనుకరించుచు, తత్సాక్షాత్కారమునకే ప్రయత్నింపవలయును.

7. ఒకడు రామావతారమును ప్రేమించి రామనామ స్మరణము చేయుచున్నాడను కొందము. కేవల నామస్మరణము నేగాక ఆయన సద్గుణంబుల తలంచుకొనుచు, ఆగుణంబులలో నొకటియైనను సంపాదించుటకు ప్రయత్నింపవలయును. (1) ప్రతిదినము ఉదయసాయంకాలముల యందు

తల్లిదండ్రులకును, ఇంటిలో నున్న పెద్దలకును విధిగా నమస్కరించుటయో, (2) పితృవాక్యపరిపాలనము కొన్ని విషయములలో నైనను చేయుటకు పూనుకొనుటయో (3) ఆయన ప్రేమతత్వమును తానును అనుకరించుటయో (4) సవతితల్లియందు ఆయన చూపించిన ప్రేమ తలంచుకొనుచు, తానును, తనపై అసూయ చూపించిన వాని యందు ప్రేమభావమునే వెల్లడిచేయుటయో, ఈ మొదలయినవి జీవితమునందు సంపాదించుకొను చుండవలయును.

8. ఒకరి చిత్తమును శ్రీకృష్ణావతార మాకర్షించు ననుకొందము. అప్పుడు కృష్ణనామస్మరణము చేయుచు, ఆయన రూపమునే ధ్యానము చేయుచు ఆయన భక్తకోటి నడచిన మార్గముల ననుకరించుచు, ఆయన స్వార్థత్యాగము మొదలైనవి తలంచుకొనుచు, ఆయన గీతలననుష్ఠాన మొనర్చుచు, ఆయనయందే తన సర్వము ధారవోయు చుండవలయును.

9. ఒకరికి గౌరాంగావతారముపై నభిమాన మనుకొందము. అపు డాయన నామమో, ఆయన కిష్టమగు నామమో జపించుచు, ఆయన నిరాడంబరత, ఆయన సులభత్వము, ఆయన అమాయకత్వము, ఆయన అపారప్రేమ, ఆయనచేసిన భాగవతసేవ, ఆయన భగవానుని నిమిత్తమై పడిన ఆర్తి, ఆయన సుగుణగణంబులు, కొన్నియైనను నడవడికయందు అలవరచుకొనుచుండవలయును.

10. ఒకరెని మహాత్మాగాంధీజీవిత మాకర్షించు నను కొందము. ఆయన నామోచ్చారణమాత్రమేగాక, ఆయన వలె అకల్మష చిత్తవృత్తిసంపాదించుకొనుట, ఆయననూలు వడకునట్లు తానును వడకుచుండుట, ఖద్దరు ధరించుట, సత్యాగ్రహ సమరమున నధికశాంతి, ప్రేమ తత్త్వమునే ఘోరశతృవులయందును చూపించుట, సులభవస్త్రధారణ, నిరాడంబరత్వము ఈ మొదలైన విషయములయందే కర చరణాద్యవయవములను కొంతవలకైనను వినియోగించు చుండవలయును.

11. ఒకరికి 'జీసస్' జీవిత మిష్టముగా నుండవచ్చును. అట్టివా డాయన నామస్మరణము చేయుటయేగాక, ఆయన పర్వతాగ్రముపై చేసిన బోధల నాచరణమునందు పెట్టు కొనుట, కొరత వేయబడినప్పుడు చూపిన ప్రేమవాత్సల్యా దులనే తానునుశత్రువులయందు చూపించుట, బ్రహ్మచర్యా శ్రమస్థానముననే యూహించుట ఈ మొదలయిన తత్త్వ ములపై తన జీవితప్రయాణము సాగించుచుండవలెను.

12. ఈ సగుణారాధనము గురించి రామగీతయందు రామచంద్రమూర్తి శ్రీలక్ష్మణస్వామి కిట్లుచెప్పియున్నారు.

శ్లో॥ "యత్త్యైవతేమామగుణం గుణాత్పరం
హృదాకదావాయదివా గుణాత్మకమ్
సోహం, స్వపాదాంచిత రేణుభిస్స్పృశ
న్పునాతిలోకత్రితయం యథారవిః॥"

"నన్ను నిర్గుణుడుగానయినను, లేక సగుణునిగా నయినను ధ్యానించిన, చిత్తశుద్ధిగలిగి ముక్తినొందును. వారిరువురి పాదధూళి సూర్య కిరణములవలె ముల్లోకము లనుం బవిత్రముచేయును."

13. శివగీతయందు పరమేశ్వరుడును శ్రీరామచంద్ర మూర్తికి సగుణారాధనము గురించి యిట్లుచెప్పియున్నారు

శ్లో॥ "మృదావా గోమయేనాపి భస్మవా చందనేనవా
సికతాభిర్దారుణావా పాషాణేనాపినిర్మితా
లోహేనవాదరంగేణ కాంస్యకర్పరపిత్తలైః
తామ్రరౌప్యసువర్ణైర్వా రత్నైర్నానావిధైరపి
అథవా పారదేనైవ కర్పూరేణాథవాకృతా
ప్రతిమా శివలింగంవా ద్రవ్యైరేతైః కృతంతుయత్
తత్రమాంపూజయేత్తేషు ఫలం కోటిగుణోత్తరం॥"

"మన్ను, గోమయము, భస్మచందనం, ఇసుక, రాయి, కఱ్ఱరత్నము, లోహము, పాదరసము, వెండి,బంగారు, యిత్తడి, రాగి, కర్పూరము, కంచు మున్నగువానిచే నాయాకారముగాని లింగాకృతిగానిచేసి పూజించిన ఫలము కోటిరెట్లుగలుగును."

14. ఇంతయేటికి సగుణారాధన చేయువారిలో నెందఱుమహాత్ములకు భగవంతుడు కోరినరూపమున సాక్షాత్కరింపలేదు! కావున తరించుటకు ముఖ్యమైనమార్గము దేహధారులకు సగుణారాధనయే.

15. ఇంక నామసంకీర్తన ప్రశంసలో పాల్గొందము గాక "నామసంకీర్తనమువలన నేమి లాభముగలుగునని" నన్ను ప్రశ్నించిన మిత్రు లనేకులు గలరు. అందులకు వారికి నేను "నామ సంకీర్తనమువలన కలుగని లాభము మఱి దేనియందునుగలుగదు" అని ప్రత్యుత్తరమొసంగితిని. అట్లడిగిన వారిని మఱొక విధముగా నడుగు చున్నాను. "అయ్యా! మీ రెన్నినాళ్ళనుండి నామ జపము చేయుచు న్నారు? రోజున కెన్నిగంటలు చేయుచున్నారు? ఎవరితో గూడి చేయుచున్నారు? ఎట్టి స్థలమున జేయుచున్నారు?" అట్లు ప్రశ్నించువారు ఒక సంవత్సరమో, ఆరు మాస ములో, నామజపము రోజునకు కనీసము మూడుగంటలైన నుచేసి, ప్రయోజనము కలుగలేదని అనుభవము చెప్పినచో శిరసావహించి యుందుము. పాపమావైపునకే పోవడు. ప్రయోజనములేదనును అట్టివానిస్థితి ఎంత లజ్జాకరము. ఎంత జాలికరము. బల్లపైనొక ఫలమున్నది. ఒకడువచ్చి అది పుల్లనిరుచిగలది. దానిని తినవలదనును. తానును తిన కయే అట్లుచెప్పినచో వానినెవ్వరును విశ్వసింపరు. ఎందుల కన, ఆతడు తిననేలేదు. రుచి చెప్పుచున్నాడు. దానిలో నొక్కతొనయైనను తినిచూచి చెప్పినచో బాగుండును గదా!

16. ఇట్లు నామస్మరణచేయుట కధికార మెవ్వరికి కలదు? ఇందులకు శివగీతయందు

"నామసంకీర్తనేధ్యానే సర్వఏవాధికారిణః"

నామసంకీర్తన ధ్యానమునకు అందరకు అధికారము న్నది. అనగా బీదలనియు, ధనవంతులనియు, ఆరోగ్య వంతులనియు అనారోగ్యవంతులనియు, బ్రాహ్మణులనియు, అబ్రాహ్మణులనియు, పురుషులనియు, స్త్రీలనియు, బాలు రనియు, వృద్ధులనియు, భేదము లేక అందరకు నధికార మున్నది.

17. ఇందులకు భగవద్గీతయందు

"అపిచేత్సుదురాచారో భజంతేమామనన్యభాక్,
సాధురేవసమంతవ్య స్సమ్యగ్వ్యవసితోహిసః"

అధికపాపులలో పాపుడైనను, గొప్ప దురాచార ములు గలవాడైనను, నా నామధ్యానము నిరంతరము చేయువాడు పరమసాధువై అమృతపదము నొందును. అట్టి యమృతపదము నొందుట కెంతకాలముపట్టును? అందు లకే గీతలలో

శ్లో॥ "క్షిప్రంభవతిధర్మాత్మా । శశ్వచ్ఛాంతింనిగచ్ఛతి
కౌంతేయా!ప్రతిజానీహి । నమేభక్తః ప్రణశ్యతి"

అర్జునా! ఎంతోకాలమా! అతి స్వల్ప కాలములోనే శాంతి చేకూరగలదు. నా భక్తుడు నశింపడని నీవు ప్రతిజ్ఞ చేయుము."

ఈ కాల వివక్షత వారివారి కృషిపై నాధారపడి యుండును. నామ సంకీర్తనమునకై వారువారు వినియో గించు గంటలపై నది రూఢిపరచుకొనవచ్చును.

## 18. నామ సంకీర్తనమువలన గలుగు ఫలములు.

(1) సంఘీభావము
(2) భూతదయ
(3) చిత్తశాంతి
(4) ఓర్పు
(5) స్వార్థత్యాగము
(6) పశ్చాత్తాపము
(7) ఏకాగ్రత
(8) భాగవతసేవ
(9) సమభావము
(10) గౌరవము
(11) అభిమానరాహిత్యము
(12) భగవత్సాక్షాత్కారము

## 19. ఇంక నగర సంకీర్తనమున గలుగు ఫలితములు.

(1) రసానుభూతి
(2) అవస్థానందము
(3) నిరాడంబరత
(4) అంతర్ దృష్టి
(5) ఊర్ధ్వగతి
(6) శరీరారోగ్యము
(7) శారీరారోగ్యము
(8) సంపూర్ణ ప్రేమ
(9) అపార భూతదయ
(10) ఆత్మసాక్షాత్కారము

ప్రత్యేకముగా ప్రచురింపబడును.

20. నామ సంకీర్తనా ఫలితము లెట్లు గలుగునో చూపి అనంతరము చేయుమార్గము నాలోచింతము.

1. సంఘీభావము:—నామ సంకీర్తనము ఒక కుటుంబములోగల భార్యా, భర్తలు, పిల్లలు, బంధువులు కలసి ఉదయమో, సాయంకాలమో, రాత్రియో, తెల్లవారు ఝాముననో, ఒక గంట కాలము చేయవలయును. మిత్రులు గాని, ఇరుగుపొరుగువారుగాని వచ్చినచో, వారు సత్వగుణ ప్రధానులని తోచినచో, వారిని చేర్చుకొనవచ్చును. లేదా

వారి మనస్సులు పరిశుద్ధమగువఱకు, ఇతరులను రానీయరాదు. నల్గురును కలసి ఇట్లు సంకీర్తనము చేయుటలో వారందరు సమానులనియు, పూర్వ పుణ్య విశేషముచే నామ స్మరణమును నావచిక్కినదనియు భావించుచు ఒకరియందొకరు సేవకభావమును చూపించుచు ఆచరింపవలయును. ఒకరి దృష్టిలో, తక్కిన వారందరును భగవదవతారములనియు, కాలవశమున మాయావరణముచే మున్గియుండుటచే ఉపాధులు వేరుగా నున్నవనియు భావింపుచుండవలయును. ఇట్లు చేయగా వారిలో భేదభావములు పోయి ఒక్కమాటపై నుండు పరిస్థితులేర్పడును. ఇట్లే ఒక వీధిలోవారు, తదుపరి ఒక గ్రామములోవారు, చేయ మొదలు పెట్టుదురు. సంఘీభావముకొలది రోజులలోనే కలుగుటకు సందేహములేదు.

2. భూతదయ:—తమ కుటుంబములోగల పిల్లలు భజన చేయుచున్నట్టి సమయమున వారిపై నెట్టి ప్రేమ గలుగునో అట్లే పొరుగింటి పిల్లలను తమ యింటికి పిలిచి, తమ పిల్లలను పొరుగిండ్లకును సంకీర్తనమునకై పంప, సమానభావము మనస్సున కలవడును. తమ యింట్లో, తమ్మాశ్రయించిన పశువులు మొదలైన వానియందు ప్రేమగలిగి తమవలెనే చూచుకొనుచు, వాటిచెవులలో సహితము నామామృతము పోయుట, మార్గస్థులెవరైన వచ్చినచో, భోజనముపెట్టి, సంకీర్తనమువఱకు నాపి, తన్నామామృతము వారికి కూడ పంచియిచ్చి పంపుట.

3. చిత్తశాంతి:—ఇట్లు భజనచేయు పిల్లలలో నెవ రైన మృత్యువు వాతబడినచో, నాత డదృష్టవంతుడనియు, తమకంటె ముందు రాముని సన్నిధానమున చేరినందులకై సంతోషించి చిత్తశాంతి నొందుట. ఐశ్వర్యములు తరుగు నప్పుడు, రాముని వస్తుదాయము రాముడే మాయచేసి గైకొనిపోవుచున్నాడను భావముతో చిత్తశాంతి కలిగియుం డుట. తమయం దెవరికేని అసూయాభావమున్నచో, వారి పాదములపై బడి, తమ అపరాధము లేకున్నను, ఉన్నదని ఒప్పుకొని, తనపై ప్రేమ నింపుమని కోరుచు, నామసంకీర్త నమునకు పిలుచుచు, వారిని అందఱకన్న నెక్కువగా గౌర వించి, తనకింకెవ్వరును అసూయాపరులు లేరని చిత్తశాంతి కలిగియుండుట.

4. ఓర్పు:—సంకీర్తన ప్రారంభించిన తరువాత అంతకంటె మఱొక గొప్ప కార్యము లేదని, దానియందే మగ్నమై యుండుటే ఓర్పు. సంకీర్తన చేయుచుండగా నెవ రైనను పిల్చినచో, అపుడు పోవక, సంకీర్తన మాపిన వెనుక నే పోవుట కలవాటుపడవలెను. ఒక్కొకతరి ఆకలి దప్పులకై నను ఓర్చుకొనుచు, అట్టి సమయమున, ఆనామామృతము, చెవులలోనుండి, హృదయమువఱకు పోవుచున్నదనియు, ఇక ప్రాపంచికాహారము దానిముందు తక్కువయనియు భావన చేయగా, ఓర్పు అధికమగును. సంకీర్తనమధ్య పిల్లలు విగ్ర హాము పడగొట్టినను, దీపమార్పినను, ఫలహారములు తామే తినినను, లేదా, ఏపిల్లియో, కుక్కయో వచ్చి, హరించినను

రామునిచిత్త మట్లున్నదని తలంచి, అహంకారమునకు చోటీయక ఓర్పు కలిగియుండవలెను.

5. స్వార్థత్యాగము:— తన కత్యవసరమగు పని యున్నను, సంకీర్తన కెవ్వరైనను పిలిచినచో, తక్షణమే తనపని (శాక్యమయినచో) మాని, తనకు లాభము వచ్చునదైనను, ఎట్లో, సంకీర్తనమునకే వచ్చుట, వారి యింట్లో, కుశలము లేకపోయినను, ఎవరైనను వచ్చి సంతర్పణమో నామసంకీర్తనమో చేయుటకు నడిగినచో, తానిరుకుడువడియైనను, ఎదుటవారికే సుఖము చేకూర్చుట, తనకు ప్రాణప్రదమైన పుస్తకమే యగునుగాక, ఎవరైనను కోరినచో దానినొసంగి త్యాగబుద్ధి చాటుట. తనకున్నను లేకున్నను సంకీర్తనాపరులతృప్తికై ప్రయత్నము చేయుట, సంకీర్తనములో మున్గిపోను మున్గిపోను తనదేదియు లేదనియు, అంతయు రామునిదేగాన, రామునికే అర్పించుట మంచిదని, ఏదైన పదార్థము కోరువారిని రామావతారముగా భావించుచుండవలయును.

6. పశ్చాత్తాపము:— అయ్యో మలమూత్రముల కొంపలో అన్యాయముగా పడియుంటినే మరల మరొకసారి అట్టి నీచస్థితికి పాల్పడనీయకు దైవమా! మంచిపనిపై బుద్ధి పోవుచున్నను, అదేమోకాని నీలీల నేననుకొనని పాపకార్యములు జరుగుచున్నవి. ఇదంతయు నీలీలగదా ఎట్లు కాపాడెదరో ఇకముందు నీపై భారముంచి జీవయాత్ర నడుపుదును, అనుచు ప్రార్థనచేయుచు పశ్చాత్తాపతప్తుడై ఆర్తి

బడుట, ఈ పశ్చాత్తాపము తరచుగా నూహించుకొను చుండవలెను. ఈ పశ్చాత్తాపముచే నిద్రాహారములు సన్నగిల్లినచో మరియు మేలే. తన కెవ్వడైన అపకారము చేసినచో, వాని చిత్తవృత్తికై తాను పశ్చాత్తాపమునొంది, అసూయ చంపుకొను చుండవలయును. సంకీర్తన ఏదైనను లౌకిక కారణముచే నాపవలసి వచ్చినచో, అపరిమితమగు దుఃఖప్రవాహమున మునిగి మరల సంకీర్తన మధికముగా చేయుచుండవలయును.

7. ఏకాగ్రత:—చేతుల తాళము వేయుచు, పాదములతో నృత్యము చేయుచు, జిహ్వాచే నామస్మరణ ముచ్చైస్స్వరమున చేయుచు, చెవులచే పైవారినామస్మరణము ద్రావుచుండగా మన స్సెక్కడకు పోవును? తన కిష్టమైన ఆరాధన దైవాకారమును ఎదుటకు తెచ్చుకొనును. అట్లెంత కాలము మనస్సుండునో అంత కాలము ఏకాగ్రతయే. అట్లు ఏకాగ్రత ఎన్ని నిముసములు దినమునకు కలుగునో, అన్ని నిముసములు మాత్రమే జీవిత కాలములో నిలువ. ఈఅంటు మనస్సునకు కలిగినచో, ఎన్నటికి విడిపోవదు.

8. భాగవతసేవ:—నృత్యము చేసినవారి పాదము లొత్తుట, వారికి ఫలహారము లొసంగుట - నామ మేజాత వాని జిహ్వవెంటవచ్చినను తక్షణమే అతని కుపకారములు చేయుట, అతనికి దాసానుదాసుడై యుండుట, ఆతనికన్నతా నెంతయో తక్కువయని భావించుట.

9. సమభావము:—ఇతర గుణములలో వేరువేరుగా కొన్నాళ్ళున్నను, నామ సంకీర్తనములో సమానత్వ మొసంగి, సమానత్వము తెచ్చుకొనుట. జన్మముచే నందఱము నొక్కటియే, యైనను, గొప్పదనము భగవత్సేవలోనున్నది గావున, భగవత్సేవ సలుపు వారెవరైనను పూజనీయులును తనకన్న వేయిమడుంగులు గొప్పవారను భావమును గలిగి, ఉపచారాదులచే నుత్కృష్టుడు కావలయును.

10. గౌరవము:—ఎట్టి వారే యే వృత్తి యందున్నను, అన్నివృత్తులు సమానస్థాన మాక్రమించు నను బుద్ధితో అందరియందును గౌరవ భావమే ప్రకటించుట తానే ఆదర్శక పురుషుని నామసంకీర్తన మొనర్చుచున్నాడో ఆ మహానుభావుడు, తనతో సమానుల యెడల నెట్టి గౌరవము చూపించెనో, తనకన్న అధికులయెడల నెట్టి గౌరవము చూపించెనో, తనకన్న తక్కువ వారియెడల నెట్టి గౌరవము చూపించెనో, అట్లే తానును గౌరవ ప్రవృత్తి యందు మెలగవలయును. నామసంకీర్తనము చేయుచున్న కొలదిని ఈ గుణము తప్పక అలవడును.

11. అభిమాన రాహిత్యము:— దేహము వేరు, ఆత్మవేరు, అను జ్ఞానము మనకు కలుగక పోయినప్పటికిని దేహీ దేహములకు భేదము చూడకయే మనము జీవయాత్ర సాగించుచున్నను, నేను బ్రాహ్మణుడను, నేను క్షత్రియుడను, నే నైశ్వర్యవంతుడను, నే నుద్యోగస్థుడను, నేను

సౌందర్యము గలవాడను, అను అభిమానము ముఖ్యముగా నశింపకావలయును. పండరీ క్షేత్రములో చూడుడు. ఒకరి కొకరు నమస్కరించుకొందురు. వారిదృష్టిలో పురుషులంద రును విఠోబాస్వరూపులనియు. స్త్రీలందఱును రుక్మాభాయి స్వరూపులనియు తలపోయుటచేతనే వారట్లు హాయిగాచేయ గలుగుచున్నారు. అందువలననే వారు గర్వపిశాచమునోట బడకున్నారు. నల్వురునుకలసి చేతులతో తాళమువేయుట తోడనే కొంత నామ ముచ్చరించినంతనే కొంత,నల్వురిలో నిల్వబడిన వెంటనే కొంత, తనకన్న తక్కువవారితోడను, అధికులతోడను కలసి నృత్యముచేసినంతనే గొంత, ఇట్లే కడకభిమానమంతయు నశించును. అభిమానము నశించిన వెంటనేమిగులునది, కావలసినది,భగవత్సాక్షాత్కారమే.

12. భగవత్సాక్షాత్కారము ప్రత్యేకముగా ప్రచు రింపబడును.

21 నామ సంకీర్తన మెట్లు చేయవలయును?

1. పదిమంది భజనపరు లొకచో కూర్చుండిన పుడు ఆరోజంతకుగాని, లేక అజామునకేగాని లేక ఒక గంటకేగాని పదిమందిలో నెవరో ఒకరే నామము జెప్పు చుండవలయును. తక్కిన వా రాతని ననుసరించి ఆతనికి సహాయమొనర్చుచుండ వలెను.

2. ఎవరి యిష్టమువచ్చినట్లు వారు కీర్తనలు పాడుట గాని, మధ్యమధ్య మాటలు చెప్పుటగాని, "రమారమణ గోవిందా హరి" యని రసభంగముచేయుటగాని, కూడదు.

3. ఆనాటికి యజమాని నామసంకీర్తన చేయించి, తాను రసానుభూతి చెందువరకు ఆనామము విడనాడకూడదు. ఆనామమే అవస్థావిశేషములచే నుచ్చరించుచు హృదయము ద్రవీభూతము చేసుకొనవలయును. తదుపరి మరియొకరిచే నామము చెప్పించవచ్చును. ప్రథమావస్థలో చైతన్యుడు పైవారిని రానిచ్చువాడు కాడు. అదిగాక సమయనిర్ణయమొనర్చి, సమయమతిక్రమించినవారిని కూడి రానిచ్చువాడు కాడు. అందువలననే ప్రథమసోపానములలో కొన్ని కట్టుబాట్లవసరమని ప్రభువువారి యుద్దేశ్యమైనట్లు తోచుచున్నది. సమయాతిక్రమణమువారి అశ్రద్ధ తెలియజేయునవి సూచించుచుండును.

4. తాళములుగాని, మృదంగముగాని ఉండవలయునను నిబంధన కలుగదు. ఎందువలన నన మనకరచరణాద్యవయవములలోనే భగవంతుడు నామగానమునకు తగిన ఏర్పాటులు చేసియున్నాడు. తాళములుగాని, గజ్జెలుగాని, ఇతరపరికరణములుగాని ఉన్నను ప్రత్యవాయము లేదు. ఉన్నచో అనేకుల నాకర్షించు టనుటలో సందేహము లేదు. తనచిత్తైకాగ్రతకును తోడ్పడుననుట నిస్సంశయము.

5. చందనము, పుష్పహారములు మొదలైనవి, అనవసరములని కొందరి అభిప్రాయము. మా గౌరాంగప్రభువు భజనలలో సంపూర్ణముగా చందనములు, పుష్పమాలికలు, ఇంకను సుగంధద్రవ్యములు మొదలైనవి వాడుకొనుట

కావున రామలీలలో, కృష్ణలీలలో, శివలీలలో, చయితన్య లీలలో తెలియజేసిన నామముగా నుండవలయును. "రాధా కృష్ణ" "సీతారామ" "మురళీమోహన" "ముద్దులకృష్ణ" "గంగాజూటా" మొదలైనవి.

7. అందరును అనుసరింపగల తేలికయగు తాళముల నే అమర్చుకొనవలయును. రసోత్పత్తియగువరకు ప్రథమ కాలమును మీరరాదు.

8. తా నుచ్చరించు నామముయొక్క అర్థమును అవస్థా విశేషమును తానాసమయమున గైకొనిన అవస్థను ఆశబ్దముచ్చరించుమార్గమును యజమాని ముందుగా తెలియ జేయవలెను.

9. యజమానియగువాడు భజనపరులలో నెవరు నిద్రపోవుచుందురో, ఎవరు నామమున శ్రద్ధతో అనుచుం దురో యని అవియన్నియు గమనించుచు మధ్యవారికి సం తోషము కలుగు నిమిత్తమై ఏవో మంచి యుపమానములు చెప్పి వారి మనస్సులు నొప్పింపకయే తన వైపునకు మరల్చుకొనుచుండ వలయును. అందులకే యజ మాని తెలివితేటలుగా, మెదలువాడును, తక్కినవారిలో కొందఱను తయారుచేయగలవాడుగాను యుండవలెను.

10. ఇట్లు భజనలుచేయుచున్నపుడు శ్రోతలోనుత్సా హముగానుండునుగాని, క్రమముగా, ఒక్కరొక్కరే జారి

పోవుచున్నపుడు, ఈ సంగతి గ్రహించిన చుట్టుప్రక్కల పేరు ప్రతిష్ఠలలోనున్న భజనపరులను పిలిపించి, వారిచేత నగర సంకీర్తనములు చేయించి, వారివల్ల నామసంకీర్తనా ప్రభావమువిని, తమ సంఘమునకు జీవనము పోయించు చుండవలయును.

11. భజనలకు ముఖ్యముగా సహాయము చేయువారు బాలురు. ప్రహ్లాదుడు చెప్పినట్లు "ఏమిచ్చిననైన పదిరూపాయ లిచ్చినను పెద్దవారిని భజనలకు రప్పింపలేముగాని, పప్పు బెల్లములచే పిల్లలనందఱను భజనలకు రప్పించవచ్చును. అట్టిబాలురనోటివెంట బాలగోపాలునినామోచ్చారణగలిగి నచో, నతడు మరువడు, మనలను మరువనీయడు. ఎందుల కన బాలురమనస్సులు ప్రాపంచిక సంస్కారములుగాక కోమల స్థితిలోనే యుండునుగదా! గౌరాంగ ప్రభువువారు బాలురతోనే కాలక్షేపము చేయుచు వారిచే నామగానము చేయించుచు, వారిద్వారా, వారితల్లిదండ్రులకు, యిండ్లలో ప్రబోధకలుగునట్లుచేసిరి. ఇంకకొలది నామము లుదాహ రణములుగాతీసుకొని వానిని ఆచరించుమార్గ మాలోచించు కొందముగాక.

(1) కోమలపదములు సీతారామ్
కోరిభజింతును సీతారామ్.

యజమాని, రామనామ మాహాత్మ్యమును భజనపరు లకు ముందుగా తెలియజేయవలెను. వాల్మీకి రామాయణ మునుండిగాని, తులసీదాసు రామాయణము నుండిగాని,

కొన్ని పద్యములో శ్లోకములో చదివి, వానిభావమును హృదయముల కెక్కింపవలెను. లేదా దాశరథీ శతకంలోని "రాకలుషంబులెల్ల బయలం బడద్రోయగ, మా, కవాటమై, దీనిప్రోచునిక్కమని ధీయుతులెన్న........" చదివి అర్ధము స్పష్టపరచుటఅనగా భజనపరుల క్షేత్రములను ఈ సంభాషణచే శుద్ధి చేయుచున్నాడు.

తదుపరి సీతారాముల కోమల పదములను వర్ణించ వలసియున్నది. ఇక్కడ యజమాని అనేక అవస్థలను గుర్తింపవచ్చును. (1) పెండ్లి పీటలపైనున్న శ్రీ సీతారాముల కోమల పదములు. (2) పట్టాభిషేక సమయమున సింహాసనముపైనున్న కోమల పదములు. ఈ రెండవస్థలలో "పెండ్లి పీటలపైనున్న పదములే'' మనల నాకర్షించును! యజమాని తక్షణమే ఆవివాహవేదిక, భజన పరుల కన్నుల యెదుటకుతెచ్చి పెట్టవలెను. మధుపర్కములతో, నునుసిగ్గుచే వంచబడిన ముద్దు మొగములతో, పసుపు పారాణిగల పదములతో, మధురాధరములతో, ముంగురుల ముచ్చటలతో, నున్నట్లున్న ఆ సమయమున జనక రాజర్షి రాముని ముద్దు పదములు కడుగుటయు, సీతారాముల ననాదిదంపతులుగా తాను గుర్తించుటయు, నను విషయములు బోధించి, తాను జనకుని అవస్థకు పాల్పడి "కోమల పదములు''అని ప్రారంభించవలెను.

సంతోషావస్థ:—ఫలమానంద బాష్పములు యజమాని "కోమల పదములు"అనియు, తక్కినవారు "సీతా

రామ్'' అనియు నుచ్చరింపవలయును. ఇట్లు ప్రథమ కాలములోనే నుచ్చరింపవలయును. సాధ్యమయినంతవఱకు తాను జనక రాజేంద్రుడనుకొని, ఆ పదములు మనోనేత్రమునకు సాక్షాత్కరించువఱకు, ఆనంద బాష్పములు కారు వఱకు, ఆ "కోమల పదములు" విడువరాదు. ఆమధ్య మనస్సునకు కలుగు పరివర్తనములు, అనుభవైక వేద్యములు, (2) పట్టాభిషేకమునాటి "కోమల పదముల" సౌభాగ్యము నంజనా తనయునకే యెఱుక, కావున రెండవ అవస్థా విశేషమును బోధపఱచి, తానాంజనేయుని అవస్థ పొల్పడి, భజనపరులను ఆనందరస నిమగ్నుల చేయవలెను. అటులే ఒక గంటయైనను కనీసమైన వెనుక "కోరి భజింతును'' ప్రారంభించి తక్కినవారిచే "సీతారామ'' అనిపించవలెను.

కోమల పదములు—మృదుమధురవాక్యములు.

సీతారాముల మృదుమధుర వాక్యముల నాలకింప నెవ్వరికిష్టముండదు- దశరథుడును, కౌసల్యయు, మహా ఋషులును మొదలైన వారికిని, వినను సంతృప్తి గలుగదుగదా—

కావున యజమాని సులభముగా దశరథుడో, కౌసల్యయో, సుమిత్రయో, భరద్వాజుడో, శబరియో, తానయి, మరల నుచ్చరింపవలయును. ఇప్పుడు సీతారాముల పలుకు లపేక్షించు చున్నవాడు కావున వారి చిరునవ్వు మొగములే కన్నుల కట్టునట్లు చేసుకొని ప్రార్థన చేయవలెను. తదుపరి "కోరితలంతును'

అని తావని, "సీతారామ్" అని తక్కినవారిచే ననిపించవలెను. యజమాని యగువాడు ఒక విద్వాంసుని జతచేసుకొని పాడవచ్చునుగాని, తన మనోస్థితికి, వారి యుచ్చారణ భంగము తెచ్చును.

## 2. "ఓ రామ, ఓ రామ, ఓంకార రామ"

ఈనామము సంతోషావస్థకును, దుఃఖావస్థకును పనికివచ్చును. సంతోషావస్థలో రాముడు విశ్వామిత్రుని అరణ్యమునకు తీసుకొని పోయినప్పుడు, విశ్వామిత్రు డానందముతో స్తోత్రము చేసినట్లుగాని, లేక అహల్యా శాపవిమోచన మైన వెనుక ఆ దేవిస్తోత్రము చేసినట్లుగాని భావించుకొనవచ్చును. ఇట్లే అనేక అవస్థలు కల్పించుకొనవచ్చును. అపుడు యజమాని ఆ యా పాత్రల ననుసరించి తన్మయస్థితికి రావలెను. ఇచ్చట రాముని బాలాకారమే మనస్సునకు గోచరించునట్లు చేసుకొనవలెను. దుఃఖావస్థ:—రామచంద్రులు కైకేయి ఆజ్ఞానుసారముగా అరణ్యవాసమున కేగినపుడు దశరథుని అవస్థగాని, కౌసల్య అవస్థగాని, లేక వచ్చినవెనుక భరతుని అవస్థగాని తెచ్చిపెట్టుకొనవచ్చును. అట్లు తెచ్చి పెట్టుకొనినపుడు మనస్సునకు రాముని విగ్రహ మెట్లు పొందుపరుపవలయును? శిరస్సున జడలు; ఒడల నారచీరెలు; భూషణాలంకారములు లేకపోవుట; స్వభావసిద్ధమగు సౌందర్యము; చిరునవ్వు వదనము. ఈ విగ్రహమునే మనస్సునందుంచుకొని, తాను రావణునిచే గొనిపో బడుచున్న సీతగా భావించుకొని భర్తృ

ధ్యానము చేయవచ్చును. ఈ అవస్థ దెచ్చుకొనుటయే యుత్తమమని తోచుచున్నది. ఈ సాంప్రదాయ మిప్పటిది గాదు. గీతాచార్యుల కాలమునాటిది. గీత 11 వ అధ్యాయములో అర్జునుడు ప్రభువువారినిచూచి "ప్రియఃప్రియాయార్హసి దేవ" యని యుచ్చరించియున్నాడు. అనగా భర్త భార్యను క్షమించునట్లు నన్ను క్షమించ కోరుచున్నాను. ప్రభువే భర్త; స్వతంత్రుడు జీవాత్మలు భార్యలు; అస్వతంత్రులు; ఇట్లు భావించి పరమేశ్వరునిసేవ చేయుట. ఇచ్చట సీత అవస్థ తాను దెచ్చుకొన్నప్పుడు రాముడు భర్త అనుభావము ముముక్షువుకూడ జ్ఞాపకమునందుంచుకొన వలెను. రామకృష్ణ పరమహంస, చైతన్యస్వామి, నమ్మాళ్వారు మొదలయిన వారీమార్గమును చూపియేయున్నారు.

(3) రామ రామ రామ సీతా.

సంతోషావస్థ:— ఈ నామమును చల్లగా పాడుకొన వలయును. సీతారామచంద్రమూర్తులను సింహాసనముపై చూచినపుడు గుహుడు తన పరివార మొకప్రక్కను, ఆంజనేయులు కోతులు నొకవైపును, విభీషణుడు తనరాక్షస పరివార మొకప్రక్కను గానముచేయు స్థితిగతులలో నేకీభవించి, యజమాని, విభీషణుడో, గుహుడో, ఆంజనేయులో యై "రామ రామ" యని తానుచ్చరించి, "రామసీత" యని తక్కినవారిచే నుచ్చరింపజేయవలెను. దడదడ పనికి రాదు. పైకాలము పనికిరాదు. ఈ ఒక్కనామము నే మూ

డుగంటలకు తక్కువగాని వ్యవధిచూచుకొని ప్రారంభించి నచో భజనపరులు పొందు చిత్తశాంతికిగాని,ఆనందమునకు గాని మేరలేదు. ఇచ్చట మనస్సునకు, సీతారాములు; వా రుపవేశించియున్న సింహాసనము, వారిభూషణాద్యలంకార ములు, వారి దివ్యసుందర విగ్రహములు; యజమాని వర్ణించి, కొన్ని శ్లోకములో, పద్యములో చదివి భజన పరుల కారూపముల నెదుట బెట్టునట్లుచేయవలెను.

## (4) కరుణాసాగర కృష్ణమురారే!

దీనిని దుఃఖావస్థలో పాడుకొనుచు భగవత్సన్నిధాన మున వలవల నేడ్చుచు, భగవంతునికన్న తనకు వేరుదిక్కు లేదని భావించుచుండవలయును. వస్త్రాపహరణసమయమున ద్రౌపదీదేవి పొందిన అవస్థయే ఇక్కడ ముఖ్యముగా పాటింపదగినది. రసానుకరణమున స్త్రీలే మనకు గురువులు. ప్రేమతత్వమెరుంగుట కైనను, మనస్సు కరగజేయుటకై నను వారే ఉపాధ్యాయులు, అట్టి స్త్రీహృదయము తాను దెచ్చుకొనుట సులభ సాధ్యము కాదు. అందును ద్రౌపదీపరిభవము, తన పరిభవముగా తలంచు కొని ధన్యుడగు యజమాని "కరుణాసాగర" అని సంకీర్తన ప్రారంభించి "కృష్ణమురారే" యని తక్కిన వారిచే చెప్పిం చవలయును. ఇచ్చట కృష్ణుడు సాక్షాత్ సర్వేశ్వరుడనియు, సర్వశక్తిమయుడనియు జ్ఞానము కలిగి, ద్వారకావాసుడగు కృష్ణరూపమే మనస్సుచే ఎదుటకు తెప్పించుకొనవలెను.

ఉచ్చైస్స్వరముతో గోలపెట్టవచ్చును. కన్నులనీరు కాల్వలై ప్రవహించువఱకు నామము చెప్పవలసినదే!

ఇది కష్టమని తోచినవారు గజేంద్రుని అవస్థకు పాల్పడి పాడుకొనవచ్చును. ఇచ్చట వైకుంఠనగరమందలి విష్ణుమూర్తి వారి దివ్యాకారము, గ్రంథములలో చెప్పబడిన ఆకారమునే వర్ణించుకొనుచు పాడవలయును. మధ్య మధ్య "లావొక్కింతయు లేదు." మొదలైన పద్యములు రసభూయిష్ఠముగా చదువుకొనవలెను. ఈ నామము గంటయైనను కనీసము స్మరింపవలయును.

ఇట్లే చక్కని నామముల నేరుకొని, వానివానికవస్థా విశేషములు కల్పించుకొని యజమాని భక్తబృందమును నడిపించవలెను. క్రింద కొన్ని నామములు వ్రాయబడుచున్నవి. వాని అవస్థావిశేషములు ముందు "నగరసంకీర్తనము" అను గ్రంథమున చెప్పబడును.

5. శ్యామసుందర మదనమోహన. (బాలగోపాలుని ఆకారము) యజమాని "శ్యామసుందర" యనిచెప్పుచు తక్కినవారిచే "మదనమోహన" యని చెప్పించవలయును యజమాని "శ్యామసుందర" అనుటకు బదులు అనేక అవస్థావిశేషములలో అనేకనామములు మార్చవచ్చును. ఇతరులు మాత్రము "మదనమోహన" యనిచెప్పుట మార్చకూడదు.

శ్యామసుందర, గోపాలకృష్ణా, గోవిందకృష్ణా, యశోదకృష్ణా, యమునాకృష్ణా, బృంధాకృష్ణా, గోపీకృష్ణా, రాధాకృష్ణా, వ్రేపల్లెకృష్ణా, వెన్నలకృష్ణా, వెన్నెలకృష్ణా, నల్లనికృష్ణా, చల్లనికృష్ణా, మురళీకృష్ణా, మోహనకృష్ణా, ముద్దులకృష్ణా, మద్దులకృష్ణా, పూతనకృష్ణా, నందానందా, మోక్షానందా, భక్తానందా, జ్ఞానానందా' రాధాలోలా, యశోదబాలా, దేవకీబాలా, క్రీడాలోలా, గొల్లలబాలా,

ఇట్లు ఒక్కొక్కటి అనేక గంటలకాల ముచ్చరింప వలయును. త్వరగా త్వరగా నామములు మార్చరాదు.

6. దీని తరువాత యజమాని "బృందావనాలోల కృష్ణ" యని చెప్పి దానినే అందఱిచేత చెప్పించుచు, తాను మార్చుచుండవచ్చును. బృందావన ప్రతినామము ముందు నుండును.

బృందావనాలోలకృష్ణ, లీలకృష్ణ, బాలకృష్ణ, గోల కృష్ణ, నీలకృష్ణ, రమ్యకృష్ణ, గమ్యకృష్ణ, సౌమ్యకృష్ణ, నందకృష్ణ, సుందరకృష్ణ, ముద్దులకృష్ణ, మందిరకృష్ణ, మోహనకృష్ణ, మద్దులకృష్ణ, రాజకృష్ణ, శేవకృష్ణ, దివ్య కృష్ణ, భవ్యకృష్ణ, సేవ్యకృష్ణ, యోగకృష్ణ, భాగకృష్ణ, భోగకృష్ణ, ధామకృష్ణ, సోమకృష్ణ, రామకృష్ణ, సీమకృష్ణ, నల్లకృష్ణ, గొల్లకృష్ణ, వేణుకృష్ణ, రాధాకృష్ణ, రంజితకృష్ణ, మొదలైనవి.

7. నందనందన - గోపాలా
8. నవనీతచోర - గోపాలా
9. గోవింద మురళి
గోపాల మురళి
10. గోవిందరాధే
గోపాలరాధే
11. గోవిందకృష్ణ
గోపాలకృష్ణ
12. గోవిందరామా
గోపాలరామా
13. గోవిందవిఠలే
గోపాల విఠలే
14. గోవింద గాంధి
గోపాలగాంధి
15. గోవింద గౌర్
గోపాలగౌర్

ఆరగింపు - మంగళము.



# నగర సంకీర్తనము

నృత్యము—నగర సంకీర్తనము.

వేషము—నగర సంకీర్తనము.

భాష—నగర సంకీర్తనము.

—నగర సంకీర్తన క్రమము.

స్త్రీలు—నగర సంకీర్తనము.

నామములు—నగర సంకీర్తనము.



"జై జై గౌరాంగకృష్ణ"

"జై జై చైతన్యకృష్ణ"



గౌరాంగ పాదధూళి.

వెల రు 0—2—0 చిన్నకోట వెంకటరత్నశర్మ.

దయచేసి పుస్తకములు ఉచితముగా పుచ్చుకోవలదు.

# నగర సంకీర్తనము



నృత్యము—నగర సంకీర్తనము.
వేషము—నగర సంకీర్తనము.
భాష—నగర సంకీర్తనము.
—నగర సంకీర్తనక్రమము.
స్త్రీలు—నగర సంకీర్తనము.
నామములు—నగర సంకీర్తనము.



"జై జై గౌరాంగకృష్ణ"
"జై జై చైతన్యకృష్ణ"



గౌరాంగ పాదధూళి.
విన్నకోట వెంకటరత్నశర్మ.

వెల రు 0—2—0

దయచేసి పుస్తకములు ఉచితముగా పుచ్చుకోవలదు.

31

సంకీర్తనామృతము 0-2-0

(ఇందు నామసంకీర్తనమువలన గలుగు ఫలితములు, చేయుపద్ధతులు చెప్పబడినవి.)

నగరసంకీర్తనము 0-2-0

(ఇందు నృత్యము, వేషము, భాష, నగరసంకీర్తన పద్ధతి, భారతదేశ స్త్రీల భక్తితాత్పర్యములు, 126 నామములు చెప్పబడినవి.)

భక్తగౌరాంగ్ 0-4-0

(చైతన్యావతారము సంక్షిప్తముగా నాటకరూపముగా వ్రాయబడినది.)

భక్తత్యాగరాజు 0-4-0

(త్యాగరాజువారిచరిత్ర నాటకరూపముగా వ్రాయబడినది.)

---

# రాబోవు గ్రంథములు.

శ్రీకృష్ణ చైతన్యావతారము— బాలకాండము, యౌవన కాండము, అవతార ప్రదర్శనకాండము, సంకీర్తన కాండము, సన్యాసయోగకాండము, యోగకాండము, నిర్యాణకాండము.

గీతామృతము—కర్మకాండము, సంకీర్తనకాండము, జ్ఞాన కాండము.

భగవత్ప్రార్థనములు—

# నగర సంకీర్తనము.

1. నగర సంకీర్తన మీనాటిదికాదు. రామాయణ కాలమున సామ్రాజ్య పట్టాభిషేకానంతరమున వానర మూక "రామ రామ రామసీతా" యని చిందులు ద్రొక్కుచు మార్గమున నగర సంకీర్తనముచేయుచు, అయోధ్య నుండి ప్రయాణమై కిష్కింధ చేరిరి.

ద్వాపరయుగంబున, గోపాలకృష్ణ ప్రభువు వ్రేపల్లె నుండి మధురాపట్టణముచేరి, అచ్చటనుండి ఉద్ధవుని వ్రేపల్లెకు పంపించెను. ఉద్ధవుడు వ్రేపల్లె చేరుసరికి, గోపికా గోపకులు "రాధాలోలాగోపాలా"యనియు, "ముద్దులకృష్ణ, మోహనకృష్ణ" యనియు వ్రేపల్లెలో నగర సంకీర్తనముచేయుట, బొడగాంచెను.

నానాటికి, కాలవశమున, నామసంకీర్తనమే క్షీణింపగా, నగర సంకీర్తనమునకు చోటెక్కడిది?

కలియుగాదిని కొందరు మహర్షులు, వారి వారి పల్లెలలో సామవేదమును గానముచేయుచు, నగర సంకీర్తన చేయుచుండు వారని, యుపనిషత్తులవలన తెలియగలదు. మఱికొంత కాలమున కిదియు నామమాత్రావశిష్టమయ్యెను.

అపుడు గోపాలకృష్ణ పరబ్రహ్మమూర్తి నవద్వీప పట్టణమునందు గౌరాంగమూర్తియై యవతరించి, నామ సంకీర్తనమేగాక, నగరసంకీర్తనమునుగూడ పునరుద్ధరించిరి. వేయి మాటలేల? స్వయముగా తామాచరించి, మార్గదర్శకులైరి. వారి శిష్యగణమును వారి త్రోవనే నడచి, లోకోపకారమును గావించిరి. ఇప్పటికిని, నవద్వీప పట్టణమున మాత్రము నగర సంకీర్తనములేని దినముండదు.

పండరీ క్షేత్రమున, నిప్పటికిని ఆషాఢమాసములో అత్యద్భుతముగా నగర సంకీర్తన జరుగును. తొలి ఏకాదశీ దినమునం దచ్చట షుమారు 100000 మంది మహాభక్తుల పాదుకల పల్లకిలలోనుంచి ముందువారు బారులుదీర్చి "జ్ఞానబా, తుకారామ్" అని కీర్తింప, చూడనివారి జీవితమెందులకు!

అట్టి దృశ్యమునుచూచినను, అందు పాల్గొన్నను, ఎవరికంట కన్నీరుగారదు? ఎవ్వ డానంద మొందకుండును? ఎవరిహృదయము ద్రవీభూతముకాదు?

## నగర సంకీర్తనము—నృత్యము

2. నగర సంకీర్తనము నృత్యము లేనిదే శోభింపదు. నృత్యమొనరించినగాని శరీరాభిమానము కొంత నశింపదు. పురుషులేగాక స్త్రీలుగూడ, అనాదినాటనుండియు నృత్యము చేసినట్లు గ్రంథములలో తెలియగలదు. ద్వాపరమున రాస

క్రీడలో గోపికలు పాల్గొనుట వినమా ? ఇప్పటికి షుమారు 800 సంవత్సరముల క్రింద జయదేవుని భార్య పద్మావతి నృత్యము చేయుట వినమా ? ఎప్పటిమాటలో యెందులకు! చైతన్యుని తల్లి శ్రీ శచీదేవి 60 సం॥ వృద్ధురాలు, నాల్గు తరముల క్రిందట, నృత్యము చేయుట వినమా ? ఇప్పటికి పండరీక్షేత్ర సమీపమున గోపాలపురములో, ఆషాఢశుద్ధ పూర్ణిమినాడు స్త్రీపురుషాదు లేకముగా నృత్యము చేయుట కనమా ? ఇప్పుడెచ్చటనైన నొకతల్లి నృత్యము చేయుచో మనకు విపరీతముగా తోచదా? హాస్యము చేయమా ?

నగరసంకీర్తనము నందలి నృత్యము, నోట నుచ్చరించు శబ్దమునకు, ఆశబ్దములో నిమిడియున్న భావమునకు, తగినట్టు లున్నప్పుడే శోభించును. నృత్యమునకు ప్రయత్న మక్కరలేదు. మనము మాట్లాడుచున్నప్పుడు, చేతులు, కన్నులు, నెట్లు సంచలనము చేయుదుమో, సంకీర్తనము కూడ, కాళ్ళు తమంతతామే చిందులు ద్రొక్కుట కాంక్షించును.

నృత్యము చేసినప్పుడుగాని, సమస్తావయవములు భగవదర్పణగావు. హస్తములు తాళములు వేయుట, పాదములు నృత్యము చేయుట, జిహ్వ పలుకులు పలుకుట, నేత్రములు తదేకదృష్టితో బాలకృష్ణునిగాని, రాధాకృష్ణునిగాని, చంద్రకళాధరునిగాని, సీతారాములగాని చూచుచుండుట. మనస్సారూపమును తెచ్చి దృష్టికెదుట పెట్టుట. చెవులలో నామును

ధారసము పడుచుండుట. ఇట్లే వానివాని పనులవిచేయుచో, ఏకాగ్రత, క్షణములో లభించును. దీనికే యోగమని చెప్పుదురు.

3. భాష:-నగరసంకీర్తనములో శబ్దములు చిన్నవై, మధురమైనవై, ఆకర్షించునవియై, పసిపిల్లవాడు మొదలు 70 ఏండ్లు ముసలివాడును, నుచ్చరింపతగినవై యుండవలయును. స్త్రీలకును, తేలికగా నుచ్చరింపవలసినవిగా నుండవలయును. మధ్యమధ్య చదువు శ్లోకములుగాని, పద్యములుగాని, అందరు నుచ్చరించునట్లు, చిన్న ముక్కలుగాచేసి, యజమాని చెప్పవలయును. యజమాని, తాను చెప్పబోవు నామార్థ మెల్లర కెరింగించి మరియు నామము ప్రారంభించవలెను.

4. వేషము:-నగరసకీర్తనములో యజమాని వేషమెట్లుండవలయునన, నాతని మొగము చూచినంతనే, రాముడో, కృష్ణుడో, విఠలేశ్వరుడో, పరమశివుడో, చూచువారికి జ్ఞప్తిరావలయును. ఇట్టి పవిత్రభావ మునయింప చేయుటకే గౌరాంగప్రభువువారు, నగర సంకీర్తనములో, పెండ్లికుమార్తెవలె అలంకరింప జేసుకొనువారు. అనగా వేషమునకంత ప్రాముఖ్యతనిచ్చువారు. వారు మాధవ జగన్నాథులను సాధువులచేయుటకు వెళ్ళినపుడుగాని, సుల్తానుదగ్గరకు వెడలినప్పుడుగాని వారివేషమిట్లున్నది:- "ప్రభువు వారు భక్తబృందము మధ్యనున్నారు; ఏమి ఆకారము

ఏమి అలంకారము? ఏమిభావము? ఏమిఆనందము? ఆకారమా! నవమన్మథుడే! షుమా రిరువదిమూడు సంవత్సరముల వయస్సు! దృఢకాయుడు! విశాలనేత్రములు! అలంకారములా? సువర్ణభూషణములు. పుష్పాలంకారములు! సిగచుట్టు పుష్పమాలలు. భుజముల పూలదండలు. ఇంతయేల? పూవులచేకప్పబడిరి. శరీరమున చందనము! ధరించినపీతాంబరములు, చేతుల చిరతలు, కాళ్ళగజ్జెలు, కన్నులకు కజ్జలము, నృత్యము జగన్మోహనకరము, మందహాస సుందర వదనారవిందము. ఈవిషయమున ఆవిగ్రహము కన్నుల చూడవలసినదే. చైతన్యమంగళము గ్రంథమిట్లు చెప్పుచున్నది. పాదములకు పసుపు పారాణియు దాల్చి, గజ్జెలు చిరుశబ్దములు చేయుచుండ ప్రభువు వారానందపరవశులై నృత్యముచేయగా చూచినవారిదే భాగ్యము. చూచినవాడందులో చేరకయుండలేడు. హృదయానందము ప్రతియవయవమునందును తెలియబడుచునే యున్నది.” ప్రభువువారి కలంకారము వారి శిష్యగణమే చేయుచుండువారు. వారువారి శిష్యగణము నందఱనుకూడ ఇట్లే చందనశరీరములతో, పూలదండలతో రమ్మని చెప్పుచుండువారు. మార్గమున వారిపై వర్షించు పూలదండలను, వారు వారిశిష్యగణమునకేగాక, అందరి మెడలను వేయుచుండువారు. ఈఆచారము లిప్పటికిని కొంతవఱకు పండరీక్షేత్రమున, నవద్వీప పట్టణమున విరాజిల్లుచునే యున్నవి. హరికథలలో కథకుని కలంకరింతుమా లేదా ? నగరసంకీర్తనములో నేల నుండరాదో ? నామసంకీర్తనములో నేల యుండరాదో ?

ఇప్పటివారికి, కన్నుల కాటుక ధరించినను అభిమానమే. కాళ్ళకు పసుపు రాచుకొనుటకు నభిమానమే! పూలదండలు ధరించుటకు నభిమానమే. చందనము రాచుకొనుటకు నభిమానమే. చేతులతో తాళములు వేయుట, కాళ్ళతో చిందులు ద్రొక్కుటయు, నోటితో నామముచ్చరించుటయు నభిమానమే! భార్య భర్తకు నమస్కరించుట కభిమానమే! పిల్లవాడు తల్లిదండ్రులకు నమస్కరించుటయు నభిమానమే! మనకు భగవదభిమాన మెట్లు కలుగును?

5. సమయపరిమాణము, ఏకాదశినాడు రాత్రి కనీస మారుగంటలును, మిగిలిన రోజులలో కనీసము నాలుగు గంటలైనను యుండవలయును. రెండుగంటలకొక యజమాని మారవచ్చును. ఎన్నియో నామము లుచ్చరించినను, మధ్య నెచ్చటనైనను ఒక్కనామము ఒక్క గంటయైనను నుచ్చరించినచో హృదయము ద్రవించుటలో సందేహముండదు. నగరసంకీర్తనములో జనులెక్కువగా నున్నపుడు, చైతన్య ప్రభువువారు, ఆసమూహమును నాల్గు భాగములు చేసి, ఒక్కొక్కరి నొక్కొక్క సమూహమునకు యాజమాన్యమిచ్చి నడపించుచుండువారు. సమయాసమయములును వారెఱుంగరు. సూర్యాస్తమయము తెలియనంతగా నామసంకీర్తన చేయించుచుండువారు.

## నగరసంకీర్తనా క్రమము.

6. చందన పుష్పాలంకార శోభితులై, భాగవతులొక్కచోట చేరవలయును. నల్వురి హస్తములలో "శ్రీ

రామచంద్ర, గోపాలకృష్ణ, శ్రీ చైతన్య, రామకృష్ణ పరమహంస; వీరియొక్క పటములుంచవలయును. వీరు పటముల యొక్క క్రింది భాగమును తమ అరచేతులలో పట్టుకొని, పటముల, పై భాగములను వక్షస్థలములు చేరునట్లు దాల్ప వలయును. ఈ సల్వుదకు ముందు భాగములో రెండు ప్రక్కలను, ఇరుపురు భాగవతులు కరదీపికలు దాల్చి నిలునబడవలయును. తక్కినవారు రెండు ప్రక్కల నద్దు కొనవలయును. నలుపురి మనుష్యులకెదురు ఖాళీస్థలములో యజమాని నిలువబడి నామము చేయించుచుండవలయును.

7 యజమాని ప్రథమమున "శ్రీకృష్ణచైతన్య" యని చెప్పి నంతనే తక్కినవారు "ప్రభు నిత్యానందా" అని యుచ్చరించవలయును. నగర సంకీర్తనాం ప్రాముఖ్యతకై వచ్చిన, అప్రతాం విశేషముగాపున, ముందు పేరినామ ముచ్చరించుటయే శ్రేయస్కరము. ఈ నామము 10 నిముసము లుచ్చరించిన వెనుక, యజమాని "హరే రామ్ హరే కృష్ణ" యని యుచ్చరింపగా, తక్కినవారు "రాధే గోవిందం" యని చెప్ప వలయును. ఇదియు 10 నిముసములైన వెనుక యజమాని "రాధే గోవిందమ్" అనియు, తక్కినవారు "రాధే గోపాలమ్" అనియు యుచ్చరింపవలయును. ఇదియు రెండు కాలములో నుచ్చరించిన వెనుక "శ్రీ మద్రమారమణ గోవిందో హరి" యని చెప్పవచ్చును.

అపుడు యజమాని "శా॥ ఏలా బ్రహ్మపదంబు?, వేదములకున్, వీక్షింపగా రాని, నిన్ను, ఈలోకంబున, ఈ

వనాంతరమునందు, ఈమందలో, కృష్ణాయంచు, ఆలాపాది సమస్తభావములు, నీయందే, సమర్పించు,నీ(వేలందొక్కరి, పాదరేణువులు, పైవేష్టించినం, జెల్లదే", అను ఈపద్యమును, కామాలుంచినచోట్ల నాపుచు, ఆముక్కలను తక్కిన వారిచే ననిపించుచు, చివరకు, "శ్రీమద్రమారమణ గోవిందోహరి"యని యుచ్చరింపవలెను. అపుడు యజమాని అందఱనుచూచి ఈపద్యములో భావమిట్లు చెప్పవలెను—నాయనలారా! చూచితిరా! ఈస్తోత్రము బ్రహ్మదేవునిచే చేయబడినది. ఒకసమయమున గోపాలకృష్ణుడు, గోపాలబాలురతో యమునానదీతీరమున చల్దియన్నములుతినుచుండెను. ఆవులు దూరమున మేయుచున్నవి. ఇంతలో బ్రహ్మ, తానే సృష్టికర్తనను, అభిమానాహంకార పూరితుడై, ఆ, ఆవులను, ఒక కొండగుహాలో దాచెను. ఆఆవులను వెదకుటకై మాయలకృష్ణుడు బయలుదేరి వెళ్లెను. ఇంతలో బ్రహ్మ, ఆ పిల్లలనుకూడ తీసుకొనిపోయి కొండగుహాలో దాచెను. ఈ సమాచారమంతయు కృష్ణుడు గ్రహించి, తనే గొల్లపిల్లలై తానే గోవులై, ఒక్క యేడు బృందావనమున సంచరించెను. ఇదంతయు బ్రహ్మచూచి, ఆశ్చర్యపడి, విచారపడి, సిగ్గుపడి, పశ్చాత్తాపపడి, అహంకారమును వదలినవాడై కృష్ణ పరబ్రహ్మమూర్తియొక్క సర్వవ్యాపకత్వమును, శక్తియు గ్రహించి, వచ్చి, గోపాలకృష్ణుని పాదములపైబడి ఈ స్తోత్రమును చేసినాడు" అని తానాపద్యమును మరల చదువవలయును. చదివి మరల జనులనుచూచి "చూచితిరా! తన యుద్యోగముకన్న గోపా

లుర పాదధూళినే శ్రేష్టముగా మెచ్చుకొనుచున్నాడు" అని చెప్పి, అచ్చటనున్న ప్రజల పాదధూళిని తాను తీసుకొని తలదాల్పవలయును. (పాదధూళి కోరినంతమాత్రముచే వారీయరు. అదిగాక దోషమనుకొని దూరదూరముగాపోవుదురు. అట్టియెడల వానినిట్లు బతిమాలవలయును) "నాయనలారా నాయందు దయయుంచి ఇంతనామము చెవులలో పోయుచున్నారు. మీా అందరికృపచే కొంత సంతోషము కలుగుచున్నది. మీా పాదధూళికూడయిచ్చి వీని తరింపజేయుడు. మిముబోలు మహాత్ముల పాదధూళి యముడుకూడ శిరస్సున దాల్చునట" అని తన ఆవేదన, ఆర్తి తెలుపుకొని దాశరథీ శతకములోని ఈ పద్యమును చదువవలయును.

" చం॥ పరమదయానిధే! పతితపావననామ! హరే యటంచు, సుస్థిరమతులై సదా భజనచేయు మహాత్ముల పాదధూళి నాశిరమునదాల్తు మీారటకు చేరకఁడంచు యముండు కింకరోత్కరముల కానబెట్టునటదాశరథీ!కరుణాపయోనిధీ!"

(ఈ పద్యముకూడ అందరిచే ననిపించవలయును) ఇది చదివి వారి పాదధూళి దొరకినంతవఱకు శిరస్సున దాల్పవలయును. (ఇట్లు చేసినగాని దేహాభిమానము, కులాభిమానము కొంత వఱకైనను నశింపదు).

తదుపరియజమాని "మురళీధర, గోవర్ధనధారీ"యను నామమును, కనీస మరగంటయైనను చెప్పించవలయును. తాను "మురళీధరగో," అనియు, తక్కినవారు "వర్ధనధారీ" యనియు, యుచ్చరింపవలయును. ఈ నామము నుచ్చరించు

నపుడు తాను తనచేతిని పైకెత్తి, తానే కృష్ణుడనుకొని, తానే గోవర్ధన పర్వతమెత్తుచున్నట్లు భావించుకొనవచ్చును. ప్రజల కాదృశ్యమును వర్ణించి, ఆరూపమును వారియెదుట పెట్టుటకు ప్రయత్నించవలయును. ఇట్లుచ్చరించిన వెనుక భాగవతములోని "శా॥ బాలుండీతడుకొండదొడ్డది, మహాభారంబు, పైరింపగా, జాలండోయని, దీనిక్రింద నిలువన్, శంకింపగా బోకుడు, ఈ శైలాంభోనిధి, జంతుసంయుత, ధరాచక్రంబు పైబడ్డ, నాకేలల్లాడదు, బంధులార! నిలుడీ క్రిందన్, ప్రమోదాత్ములై" అను పద్యమును తాను చదివి ఆ హరిచేతను చెప్పించి దానిభావమును వ్యక్తీకరింపవలయును. "నాయనలారా! చూచితిరా! గోపాలకృష్ణుండు గొల్లవారికెట్టి అభయప్రదానమును చేయుచున్నాడో! నేను బాలుడను, గోవర్ధనగిరి పెద్దది, మహాభారము, నేను మోయగలనో, లేనోయని సందేహింపకుడు, ఈసమస్తపర్వతములు సప్త మహాసముద్రములు పైబడినను నాహస్తము కదలదు. మీరు సందేహములు వదలి నాయండజేరుడు. క్రిందికి రండు. మీరు నాబంధువులు. జీవాత్మలు నాకాప్తులు. నన్ను నమ్మినచో మీసంసారభారములన్నియు నేనే మోసెదను. నేనేమో యశోదపిల్లవాడననియు, బాలుడననియు, భావించి, సందేహింపక విశ్వాసముతో నన్ను సేవింపుడు. మీరు రక్షింపబడుదురు," అని యెంతచక్కగా తనగొప్పతనమును వెల్లడించెనో చూచితిరిగదా! అని తానాపద్యమును మరల చదివి "శ్రీమద్రమారమణ గోవిందో హరి" అని యుచ్చరింపవచ్చును.

ప్రభుపతి "మురళీలోలా"యని తానుచ్చరించుచు, "గోపాలా" యని తక్కినవారిచే ననిపించవలయును. ఈ నామమెన్నిగంటలైనను జపించవలసినదే. తాను కృష్ణుని వలె నృత్యముచేయుచు, చేతిచిరతలను నోటిదగ్గరకు తెచ్చి అది మురళిగా భావించుకొని స్వస్థపాదుడై తానుజనుల నానందమున దేల్పవచ్చును. అందరను అట్లేనిల్వబడునట్లు చేయవచ్చును. కనీసమొకగంటయైన నుచ్చరించిన వెనుక "కృష్ణా నీవింకను కనుపించవా? ఈపాపిని తరింపజేయవా?" యను భావమును లోపలనుంచుకొని విచారముగా నుచ్చరింపుచు, కన్నులనీరు గారువరకు చేసి, ప్రజలను రసానందుల చేయవలయును. సంకీర్తనాధ్యక్షయజమాని తానందరివైపు జూచుచు తాళములు వేయక నిలువబడియున్నవారిని చూచి హెచ్చరించవలయును. ఎట్లు? "నాయనలారా! చేతులనుపైకెత్తియుడు తాళము వేయుడు. అయ్యో! ఈ మాత్రమునకైనను నోచుకొనలేదా? శుకమహర్షి పరీక్షిత్తున కేమిచెప్పెనో తెలియునా? "కమలాక్షుపూజకుగాని హస్తంబులు, శవముహస్తంబులు సత్యవచన" అని సెలవియున్నారు. భగవంతునిచే సేయబడిన చేతులతో, నాయనకీయుపచారము చేయుచో మనము తిరిగి పుట్టవలసినది లేదుగదా! మనము తాళము వేయనిచో శవసమానులమే గదా! ఈమాత్రమునకే అభిమానము గలిగి ముందంజ వేయగలమా! భగవంతునికి మనమెంతదూరములో నున్నామో చూచుచుంటిరిగదా!" ఇట్లు చెప్పిన వెనుక కొందరు తాళములు వేయుదురు ఇంకను కొందరు వేయనివారుందురు. వారిదగ్గరకు తానేగి సాష్టాంగ

నమస్కారముచేసి ప్రతిమాలు కొన్నచో, వారును వేయుదురు. *ఇందులో నేమున్నదని, కొంద రక్కడ ప్రశ్నించెదరు. అట్టిప్రశ్న వచ్చినపుడు, అక్కడనేమియు సమాధానము చెప్పక తన సంకీర్తనము తాను సాగించుచుండవలయును. శాంతమునువీడరాదు. పట్టుదల కూడదు.

కొందరు నామము చేయనివారుందురు. వారినిచూచి “ఓహోహో బహుబాగున్నది. శబ్దమేమియు చాలుటలేదు. మన శబ్దమునకు కామక్రోధాదులు పారిపోవలయు. నిద్రాదేవత తొలగిపోవలయు. ఏదీ అందరు బిగ్గరగాఅని ఈపాపి చెవిలో నింతనామముపోసి కటాక్షించుడు. నిన్ను యాచించుచున్నాను. ధనమునకైగాదు. బిరుదులకైకాదు. కీర్తికై కాదు. నామామృతభిక్ష పెట్టుడని కోరుచున్నాను. మీమేలు మరువను”అని పలికినవెంటనే “శ్రీమద్రమారమణ గోవిందోహరి” యని చెప్పించవలెను. పూర్వముకన్న హెచ్చుగాచేయుదురు. అపుడు మరల రుజనూనివారిని చూచి “అయ్యో! శబ్దముచాలనేలేదు! నామీద కోపమా! నామీద కోపమైనను, కృష్ణునిమీద కోపమెందులకు? ఒక రాజొకగ్రామములో పెద్దలనుపిలచి, అందఱనుతలొకబిందెడు పాలుతెచ్చి ఒకనూతిలోపోయుడని ఆజ్ఞాపించెను. అందరును

*వీడు పట్టిచెరుకూరులో గానము చేసినపుడొకబ్రాహ్మణోత్తము డెంతసేపటికిని తాళము వేయనేలేదు. తుదకు వీడు ప్రదక్షిణముచేసి, నమస్కారము చేసినపుడు వారికి కటాక్షమువచ్చి తాళమువేసి భజన లోనికి వచ్చిరి. అప్పటికిగాని వారి హృదయము కరుగలేదు.

తెచ్చి సమయము చూచి పోసిపోయిరి. తరువాత రాజుగారు చూడగా అంతయు నీరేయున్నది. ఇదేమని ఒక్కొక్కరి పిలిచి యడుగగా వారు "అయ్యా క్షమించుడు, అందరును పాలుపోసినపుడు నాబిందెడు నీరు అందులో గలసిపోవదా?" అని నీరు పోసితిననెను. ఇట్లే అందరు జవాబులు చెప్పిరి. ఇట్లే నాయనలారా! మన మనవలెనా? మనమన్నట్లు గుర్తింపగలరా? ఆశబ్దములో మనము నన్నట్లే తలతురని కొందరూరుకొన్నట్లున్నారు. అయ్యారు ఎవరికివారే యము నాతీరే, అన్నట్లు ఎవరి పుణ్యమువారిదే, ఎవరి పాపము వారిదే! ఏదీ ఈపర్యాయమందరు బిగ్గరగా నామముచేసి సంతృప్తిచేయుడు" అని "మురళీలోలా" యని తాను చెప్పి వారిచే "గోపాలా" యని చెప్పించవలెను. అప్పుడందరును బిగ్గరగా "గోపాలా" యని యుచ్చరింతురు. ఆయుత్సాహముతో నా నామము అరగంట యుచ్చరించి, ఇష్టము వచ్చినట్లు పిచ్చివానివలె గంతులు వేయవచ్చును. నృత్యము చేయువచ్చును. అందరు నిది చూచుచుందురుగాని, కొందరావేశపూరితులై, తనుంతటతామే చిందులు ద్రొక్కుచు పట్టుదలతో నామముచ్చరింతురు. అప్పటికి "శ్రీమద్రమారమణగోవిందో హరి" యని యుచ్చరింపవచ్చును ప్రజలనుత్సాహపరచుటకై, ఈ పర్యాయము తాను పద్యము చదువక, వారిలో నెవ్వరినైనను చదువుమని చెప్పవలెను. వారట్లు చదివిన వెనుక, "గోవింద" కొట్టిన వెనుక తాను "రఘుపతి రాఘవ"యని యుచ్చరించి "రాజారామ్" అని తక్కినవారిచే ననిపించవలయును.

ఇట్లుచ్చరించుచు ఒక యింటిదగ్గరనుండి మఱొక యింటికి వచ్చుచు, ఆయా యిండ్లయొద్ద నొకింతసేపాగుచు, భజనజేయుచు, వారు హారతులిచ్చినను, ఈయకపోయినను ఆయింటి గృహస్థునిగూడ తమతో భజనవెంట, యజమాని యగు వాడు దోడ్కొనిపోవలయును. ఒకొక్కయజమాని "అయ్యా! కొంచెముతొందరపనియున్నదివిడువుడు" అని చెప్పును. అప్పుడా గృహస్థునిచూచి "నాయనా! రెండడుగులుమాత్రము మాతో వచ్చిపొమ్ము, మీవంటి పుణ్య గృహస్థులతో మేము కొంతదూరము నడచినను మేలేగదా! మీ సాంగత్య మొకింతసేపు గలిగినను మంచిదేగదా! యని ప్రత్యుత్తరముచెప్పి వెంటదోడ్కొని పోవలయును.

ఇంతలో ఆ గృహస్థుని యిల్లాలు, తటాలునవచ్చి, నగరసంకీర్తనముచేయు యజమానునికి, నమస్కరించును. తత్క్షణమే యజమాని ఆతల్లినిచూచి ఇట్లు ప్రబోధన చేయవలయును "అమ్మా! ఇట్లు నాకు నమస్కారముచేయుట పాడిగాదు. అదుగో! నీదేవుడు (అని ఆపెకు ఆమెభర్తను చూపించి) ఆయనయే నీత్రాత; నీరక్షణకర్త, ఆయనకన్న నీకు నమస్కరింపదగిన వస్తువుగాని, పూజింపదగిన పదార్థముగాని వేఱొండులేదు. ఒక్కనాడైనను నీభర్తకు నమస్కరించితివా! లేదుగదా, నీబిడ్డనగు నాకాళ్ళపైబడినంత నీకేమియు ప్రయోజనము? పతివ్రతయగు కాంతకు భర్తకన్న దైవమే లేదు. విష్ణు ప్రియాదేవి ఏమిచేసినదో తెలియునా? శ్రీకృష్ణుడు ప్రత్యక్షమైనపుడు, "నాకు నీవక్కర

లేదు. నీనామమక్కరలేదు. నాభర్తయే నాకు కావలయును. నా భర్తయొక్క నామస్మరణమే నాకు కావలసినది. నా భర్తను నాకిచ్చి వెడలిపొమ్ము" అని ప్రార్థించినది. కావున నోతల్లీ నీభర్తకు నాయెదుట నొకసారి నమస్కరింపుము" అని దీనముగా వేడుకొని, ఆతల్లిచే ఆయజమానునికి నమస్కారముచేయించి అక్కడనుండి ఆయజమానునితో కదలి పోవలయును. ఒక్కొకచోట భార్యాభర్తలు లజ్జింతురు. అట్టిసమయములయందు ప్రబోధమాత్రమే చేసి కదలిపోవలయును. తత్క్షణమే "రఘుపతిరాఘవ" యని యుచ్చైస్స్వరముతో హుంకరించినట్లు నామము ప్రారంభించవలెను. నాలుగువీధులు కలసినచోట్ల భక్తగణమును వలయాకారముగా చేసి భజన చేయించుచు, యజమానిపై వారినికూడ, అందులో చేర్చి నామము చేయించవలెను. అట్టిస్థలములయందు యజమాని తాను, రాధాస్థితికో, లేక రుక్మిణీస్థితికో వచ్చి, వారివారి పద్యములు చెప్పవచ్చును. చెప్పుటమాత్రమే కాదు. వారు పడిన ఆ వేదనంతయు తాననుకరించి సభ్యుల నానందవశుల చేయవలయును. తాను రుక్మిణీస్థితికి వచ్చి " మ॥ ఘనులాత్మీయతమోనివృత్తికొఱకై, గౌరీశుమర్యాద, నెవ్వనిపాదాంబుజశౌచమందు మునుగన్ వాంఛింతురే, నట్టినీ, యనుకంపన్ విలసిల్లనేని, వ్రతచర్యన్ నూరు జన్మంబులన్, నిను చింతింపుచు ప్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా!" అను పద్యముచదివి అరసానుభూతికి తానువచ్చి దుఃఖబాష్పములు కార్పవలయును. లేదా, తానుగోపిక భావముతెచ్చుకొని, తన్ను కృష్ణుకు

విడనాడి పోయినట్లును, ఆయన నిమిత్తమై వెదుకుటకు, తాను బృందావనములో సంచరించుచున్నట్లును, రసావేశుడై "ఉ॥ నల్లనివాడు, పద్మనయనంబులవాడు, కృపారసంబు, పై, జల్లెడువాడు, మాళిపరిసర్పితపింఛమువాడు; నవ్వు రాజిల్లెడు మోము వాడొకడు, చెల్వల మానధనంబుదెచ్చె, నోమల్లియలార! మీపొదలమాటున లేడుగదమ్మ చెప్పరే!" అని పాడుకోవలయును. ఆ సమయమున, తానున్న స్థలమే బృందావనమనియు, చుట్టునున్న ప్రజలే మల్లె వృక్షములుగాను, భావించుకొననిదే రసానుభవము కలుగదు. అందులోని చరణములు మాటిమాటికి చెప్పుకొనుచుండవలయును. అంతలో కృష్ణుని కోమల పాదపద్మములు స్మరణకు తెచ్చుకొని "మ॥ అరవిందంబులకంటె కోమలములై, అందంబు పొప్పు, నీ, చరణంబుల్ కఠినంబులై మొనయుమాచన్నులంగవల్ మోవగా, నెరయంబోలునటంచు పొక్కుదుము, నీ యీకర్కశారణ్య భూపరి సంచారము కృష్ణ! నీప్రియలకున్ ప్రాణవ్యథంజేయదే?" అని చదువుకొని వలవల దుఃఖించునంత స్థితికి తానువచ్చినగాని సభ్యులారస మనుభవించలేరు.

అంతలో పైకుతికి "గోపాలకృష్ణ! గోవిందకృష్ణ!" యను నామమును పై కాలములో, క్షణమైన వ్యవధినీయక చెప్పించవలెను. తాను గోపాల కృష్ణయనియు, తక్కినవారిచే "గోవిందకృష్ణ" యనియు, చెప్పించవలెను. ఇట్లొక పావుగంటయైనను చెప్పించి తదుపరి "పతితపావన" యని

తానుచెప్పి "సీతారామ్" అని అందరి చేతను చెప్పించ వలెను. ఈ నామము కనీసము అరగంటయైనను పైకాలము లో నుచ్చరించవలయును.

అప్పుడప్పుడు ఇతరమతస్థులు మార్గమధ్యమున కని పించినను వారినికూడ భజనచేయుడని ప్రార్థించవచ్చును. వారు చేసిన సంతోషమే, చేయకపోయినచో నవమానముగ భావించరాదు. * (వీడు ముట్లూరులో గానము చేసినపుడు క్రైస్తవమతస్థులు కొందరు వీనిభజనలోచేరక నిలువబడి యుండిరి. వారిని వీడు బ్రతిమాలుకొనినను వారువినలేదు. అపుడు వీడు నామమునుమార్చి " జీసస్ మురళి, మరియా మురళి"యని చెప్పినంతనే వారందరునువచ్చి, యుచ్చరించి నృత్యముచేసిరి.) కావున ఎవరికిష్టమగు నామమును వారే చేయునట్లు యజమాని సమయానుకూలముగా నడచుకొని, భగవన్నామ సంకీర్తనమే ప్రధానోద్దేశ్యముగా నుంచుకొన వలయును. ఆసమయమున " బైబిలు " లోనుండి కొన్ని మహా ద్వాక్యములుచెప్పి వానిభావ మందఱకు నెఱిగింప వచ్చును.

అక్కడనుండి కదలి " శంకరశంకర" యని తాను చెప్పి "మహాదేవా"యని తక్కినవారిచే ననిపించవలెను.

---

* ఈమధ్య నెవరియింటియందైనను రోగులుగాని, వృద్ధులుగాని, లేవలేనివారుగాని. యున్నారని తెలిసినచో, యజమాని లోపలకుపోయి కొందఱను మాత్రమే వెంటతీసుకొని, ఆమంచముదగ్గర నామముచెప్పి ఐదునిముసములైనను ఆగి పిదుపరి బైటకు రావలయును.

తాను నామమును మార్చవచ్చునుగాని సభ్యులను మార్పించరాదు. తానీనామమునే పదిపదినిముసములకును "శంభో శంకర"యనియు "గంగాజూటా"యనియు, "చంద్రకళాధర" యనియు మార్చుచుండనలయును. మార్చునపుడు ఆ మహాశివుని ఆకారమును తన మనోనేత్రమునెదుట సాక్షాత్కరించుకొను చుండవలయును. అట్లు రూపమెదుటకు వచ్చువఱకు గానము చేయుచునే యుండవలయును. ఎదుటకు వచ్చిన వెనుక తప్పిపోకుండ మనస్సునునిలిపి, స్వామివారి ప్రతియవయవమును పరిశీలించుచున్నగాని మనస్సచ్చట నిలువదు. ఇక్కడనే యజమాని కష్టపడవలసిన ఘట్టము. ఒక్కొక్కనాడు హృదయము కరుగనేకరుగదు. ఆనాడు నిరుత్సాహపడరాదు. ఒక్కొక్కనాడు అరగంటలోనే హృదయము ద్రవీభూతము కాగలదు. ఒక్కొక్కసారి నామమెత్తుకొనిన వెంటనే రూపసాక్షాత్కారములభించి హృదయము చప్పున నీరగును. ఆనాటి సంకీర్తనమంతయు ఆనందమయముగానే యుండును. ఇంకను కొన్ని నామములు జేయించి ప్రారంభించినస్థలమునకువచ్చి అందరిచేతను ఈపద్యమునుచెప్పించవలయును "శా॥ భక్తత్రాణపరాయణుండవని నిన్ ప్రార్థించుచున్నారము; ఆసక్తిన్, సంసరణంపు వాంఛలకు, నాసల్పేయ లేశంబు; ఏయుక్తుల్, నిన్ బరితృప్తిచేయవని,నామోచ్చారణాభ్యాసినై, ముక్తిన్గోరుదు, రామ! కృష్ణ! శంభో! తావక, కృపాంభోరాశిలో ముంచవే!" రామయను సంబోధనమూర్తితో, నుచ్చైస్స్వరముతో, ఐదారుసార్లనిపించవలయును.

అప్పుడందరిచేతను పటములకు సాష్టాంగ నమస్కార ములుచేయించి, వారి పాదధూళి తన శిరస్సున దాల్చుకొన వలయును.

## మంగళము.

తదుపరి మంగళము చెప్పుచు నందరిచేతను నృత్య ము చేయించవలయును. తాను "జయాజయమంగళం, నిత్య శుభమంగళం" అనిచెప్పి, ఈవాక్యములే పైవారిచే ననిపిం చి,తదుపరి మంగళనామము నుచ్చరింపవలయును. దానిని సమయానుకూలముగా వ్యవధి నేర్పఱచుకొనవచ్చును.

"గోపాలకృష్ణునకు"అని తానుచ్చరించి "గోవిందకృష్ణు నకు"అని తక్కినవారిచే పై కాలమువఱకు జరిగింపవచ్చును. తాను "శ్రీరామచంద్రునకు"అని యుచ్చరించి "సీతాభిరా మునకు" అని పైవారిచే ననిపించవలయును. తాను "గౌ రాంగ ప్రభువునకు"అని యుచ్చరించి "చైతన్యదేవునకు" అని పైవారిచే ననిపించవలయును. మంగళము కనీసము అరగంటయైనను జరిగినచో బాగుండును. పదములకు తగిన అడుగులు, అడుగులకుతగిన నృత్యము, నృత్యమునకుతగిన చిందులు, చక్కగా నొనరించి సభ్యులనుకూడ ఆనందవశు లచేయవచ్చును.

## ఆరగింపు

తదుపరి స్వామివారికి ఆరగింపు జరిపింపవలయును. ఆరగింపులోకూడ నామసంకీర్తన మొక పావుగంటయైనను

జరుగవలయును. ఇచ్చట యజమాని "ఆరగించు గోపాల" యనియు, తక్కినవారు "ఆరగించు గోవింద" యనియు, యజమాని "ఆరగించు శ్రీరామ" యనియు తక్కినవారు "ఆరగింపు సీతమ్మ" యనియు యజమాని "ఆరగించు గౌరాంగ" యనియు తక్కినవారు "ఆరగించు చైతన్యమనియు" చెప్పవలయును. చక్కగా నృత్యగానముల చే జరిగింపవలయును. నామమునకు మధ్యక్షణమైనను ఖాళీ నీయరాదు. తదుపరి "శ్రీమద్రమారమణ గోవిందో హరి" యని అందరిచే చెప్పించి ప్రసాదవినియోగము చేయించు చుండవలయును.

ప్రసాదవినియోగ సమయమునకూడ నూరకుండ రాదు. యజమాని "నందనందన" అని చెప్పి తక్కినవారిచే "గోపాలా" యని యుచ్చరింపచేయుచుండవలెను.

అట్లు నామము చెప్పుకొనుచు యెవరియిండ్లకు వారు పోవలయును.

## స్త్రీలు నగరసంకీర్తనము.

8. "కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమ" భగవద్గీత.

శ్రీకృష్ణపరమాత్మ స్త్రీలకెట్టి స్థానమిచ్చియున్నారో తిలకింపుడు. స్త్రీలలో గలకీర్తి, ఐశ్వర్యము, సౌందర్యము, వాక్కు, జ్ఞాపకశక్తి, ధైర్యము, ఓర్పు, నాస్వరూపముచే. అనగా పాతివ్రత్యనిష్ఠ, పతిభక్తి, దైవభక్తి, మృదువాక్కు,

కష్టసహనము, అనుష్టానమునందున్న స్త్రీలకు నమస్కరింపుము. లేదా, ఏస్త్రీలు నన్నుభజించుటవలన కీర్తిసంపాదించెదరో తమఐశ్వర్యము నానిమిత్తమైవినియోగించెదరో, యేస్త్రీలు తమజిహ్వలను నానామసంకీర్తనముకై వినియోగపరచెదరో, యేస్త్రీలు ధైర్యముతో భవబంధవిచ్ఛేదమునకై ప్రయత్నించెదరో, యేస్త్రీలు అధికమగు నోర్పుతో భర్తలను సేవించెదరో, వారియందు నేనున్నాను ”అనిభావము.

అదిగాక, స్త్రీలేగదా గర్భధారిణులు. అట్టివారికే భక్తిఅనవసరమయినచో వారిసంతానమెట్లుండునో యోచించుకొనుడు. స్త్రీలేకదా ఉభయకులపవిత్రలు, స్త్రీలేకదా సంసారమూలకారిణులు, స్త్రీలేకదా మనగృహస్థాశ్రమప్రవర్తనీయులు, స్త్రీలేకదా పురుషుల కీర్తిప్రతిష్టలకు కారణము. అట్టిస్త్రీలయినను భక్తియుతులైనచో వారిఆత్మశక్తి వారినేగాక పురుషులను గూడ నుద్ధరింపగలదు. మనయిండ్లలో శుచి, శుభ్రత, ఆచార వ్యవహారములు, ఇంకను నిల్చియుండుటకు స్త్రీలేగదా కారణభూతులు. వేదములు రచించిన స్త్రీలులేరా? యోగశాస్త్రములు రచియించిన స్త్రీలులేరా? మొల్ల రామాయణము రచింపలేదా? కావున స్త్రీలు ముఖ్యముగా నామ సంకీర్తనము నగర సంకీర్తనమును చేయవలయుననియే పెద్దల యూహలు కాని వారి సమాజములు, వారిసంకీర్తనములు పురుషులతో సంబంధము లేకుండా విడిగానుండవలయును.

ఒక వివాహము జరుగుచున్నప్పుడు స్త్రీలు పల్లకి వెంట మంచియెండలోనైనను,వర్షములోనైననుపోవుటలేదా? నోములు వ్రతములు చేసుకొనుచున్నప్పుడు గుంపులుగాచేరి వీధులవెంట వెళ్ళుటలేదా? శ్రావణ మంగళవారములలో శనగల నిమిత్తమై ఇంటింటికి పోవుటలేదా?

కావున వారు ముఖ్యముగా నగర సంకీర్తనములలోను, నామ సంకీర్తనములలోను పాల్గొని వారి భక్త్యాతిశయములచే తమ భర్తలను, తమబిడ్డలను, తమసోదరులను భక్తిపూరితులచేసి నుద్ధరింతురుగాక! వారి భక్త్యనుష్ఠానములకు పురుషులు తోడ్పడుదురుగాక!

## నామములు

నగర సంకీర్తనములోగాని, నామ సంకీర్తనములోగాని ఉపయోగింపదగు నామములుకొన్ని నీక్రింద సూచించుచున్నాడు. బుద్ధి కుశలతగల మహానుభావు లెన్నియో కల్పించుకొనవచ్చును.

ఒకొక్క నామము కనీసము అరగంటయైనను నుచ్చరించవలయును. లేనిదే చిత్తైకాగ్రత లభించుటకష్టము.

| | | |
|---|---|---|
| ౧ | గోపాలకృష్ణ | గోవిందకృష్ణ |
| ౨ | భూపాలకృష్ణ | ,, |
| ౩ | యశోదకృష్ణ | ,, |
| ౪ | మధురాకృష్ణ | ,, |

| | | |
|---|---|---|
| ౫ | ద్వారకకృష్ణ | గోవిందకృష్ణ |
| ౬ | ద్రౌపదికృష్ణ | ,, |
| ౭ | కుబ్జాకృష్ణ | ,, |
| ౮ | దేవకికృష్ణ | ,, |
| ౯ | కోమలకృష్ణ | ,, |
| ౧౦ | రాధాకృష్ణ | ,, |
| ౧౧ | మురళీకృష్ణ | ,, |
| ౧౨ | గోపీకృష్ణ | ,, |
| ౧౩ | గీతలకృష్ణ | ,, |
| ౧౪ | భారతకృష్ణ | ,, |
| ౧౫ | నల్లనికృష్ణ | ,, |
| ౧౬ | చల్లనికృష్ణ | ,, |
| ౧౭ | అల్లరికృష్ణ | ,, |
| ౧౮ | ముద్దులకృష్ణ | ,, |
| ౧౯ | మోహనకృష్ణ | ,, |
| ౨౦ | యమునాకృష్ణ | ,, |
| ౨౧ | వేదాంతకృష్ణ | ,, |
| ౨౨ | మోహనమురళీ | పాండురంగ |
| ౨౩ | గీతలమురళీ | ,, |
| ౨౪ | విఠలవిఠల | ,, |
| ౨౫ | పండరినాథా | ,, |
| ౨౬ | సక్కుభాయిమురళీ | ,, |
| ౨౭ | జ్ఞానదేవ్‌మురళీ | ,, |
| ౨౮ | తుకారామ్‌మురళీ | ,, |

| | | |
|---|---|---|
| ౨౯ | భక్తత్రాతా | పాండురంగ |
| ౩౦ | నందానందా | ,, |
| ౩౧ | జ్ఞానానందా | ,, |
| ౩౨ | యోగానందా | ,, |
| ౩౩ | భక్తానందా | ,, |
| ౩౪ | గోపాలవిఠల | ,, |
| ౩౫ | గోవిందవిఠల | ,, |
| ౩౬ | మోహనవిఠల | ,, |
| ౩౭ | ముద్దులవిఠల | ,, |
| ౩౮ | గోపీవిఠల | ,, |
| ౩౯ | రాధావిఠల | ,, |
| ౪౦ | రుక్మిణీవిఠల | ,, |
| ౪౧ | దశరథనందన | రామచంద్ర |
| ౪౨ | దానవమర్దన | ,, |
| ౪౩ | పతితపావన | ,, |
| ౪౪ | మోహనరూపా | ,, |
| ౪౫ | కౌసల్యతనయా | ,, |
| ౪౬ | కాకుస్థాన్వయ | ,, |
| ౪౭ | కైకేయిప్రియ | ,, |
| ౪౮ | కరుణాసాగర | ,, |
| ౪౯ | రావణసంహార | ,, |
| ౫౦ | శబరిసన్నుత | ,, |
| ౫౧ | సుందరవదనా | ,, |
| ౫౨ | శంకర శంకర | ,, |

| | | |
|---|---|---|
| ౫౩ | శంభో శంకర | మహాదేవా |
| ౫౪ | భక్తవశంకర | ,, |
| ౫౫ | గంగాజూటా | ,, |
| ౫౬ | లలాటనేత్రా | ,, |
| ౫౭ | సర్పాహారా | ,, |
| ౫౮ | చంద్రకళాధర | ,, |
| ౫౯ | కారుణ్యాకర | ,, |
| ౬౦ | కైలాసాధిప | ,, |
| ౬౧ | పార్వతీనాథా | ,, |
| ౬౨ | అనాథనాథా | ,, |
| ౬౩ | గౌరీశంకర | ,, |
| ౬౪ | కేశవమిత్రా | ,, |
| ౬౫ | శ్రీ గౌరంగా | శ్రీ చైతన్యా |
| ౬౬ | శచీకుమారా | ,, |
| ౬౭ | మోహనమూర్తీ | ,, |
| ౬౮ | అఘవినాశనా | ,, |
| ౬౯ | చందన చర్చిత | ,, |
| ౭౦ | నిత్యానందా | ,, |
| ౭౧ | రామానందా | ,, |
| ౭౨ | మురారిరక్షక | ,, |
| ౭౩ | అద్వైతావన | ,, |
| ౭౪ | అద్భుతవిషయా | ,, |
| ౭౫ | కేశవరక్షక | ,, |
| ౭౬ | హరిదాసప్రియ | ,, |

౭౭ రాధాలోలా శ్రీ చైతన్య
౭౮ మురళీలోలా ,,
౭౯ మోహనబాలా ,,
౮౦ విలాసపురుషా ,,
౮౧ ప్రేమానందా ,,
౮౨ భక్తానందా ,,
౮౩ నాట్యానందా ,,
౮౪ మాధవరక్షక ,,
౮౫ కరుణాసాగర ,,
౮౬ దయాసముద్రా ,,
౮౭ కృష్ణావతారా ,,
౮౮ రామావతారా ,,
౮౯ ప్రేమావతారా ,,
౯౦ శాంతాకార ,,
౯౧ నామోద్ధరణా ,,
౯౨ నవద్వీపవాసా ,,
౯౩ మృదుతర వేషా ,,
౯౪ మధురాభాషా ,,
౯౫ పతితపావన ,,
౯౬ ప్రాణాధారా ,,
౯౭ బృందావాసా ,,

౯౮ పండితరక్షక (శ్రీ) చైతన్యా

౯౯ పామర రక్షక ,,

౧౦౦ పీతాంబరధరా ,,

౧౦౧ గోవింద గాంధీ గోపాలగాంధీ

౧౦౨ గోపాల గాంధీ రాట్నపుగాంధీ

౧౦౩ రాట్నపుగాంధీ రాయబారి గాంధి

౧౦౪ రాయబారిగాంధీ ఖద్దరుగాంధీ

౧౦౫ ఖద్దరుగాంధీ భారతగాంధీ

౧౦౬ భారతగాంధీ గీతలగాంధీ

౧౦౭ గీతలగాంధీ మోహనగాంధీ

౧౦౮ మోహనగాంధీ వామనగాంధీ

౧౦౯ వామనగాంధీ కస్తూరిగాంధీ

౧౧౦ కస్తూరి గాంధీ నవ్వులగాంధీ

౧౧౧ నవ్వులగాంధీ నల్లవారి గాంధీ

౧౧౨ నల్లవారిగాంధీ తెల్లవారి గాంధీ!

౧౧౩ హరినారాయణ గోవింద

౧౧౪ దుర్జనభంజన ,,

౧౧౫ అర్జునరక్షక ,,

౧౧౬ ఆపద్బాంధవ ,,

౧౧౭ మత్స్యావతార ,,

౧౧౮ కూర్మావతార ,,

౧౧౯ వరహావతార గోవింద

౧౨౦ నరసింహావతార ,,

౧౨౧ వామనావతార ,,

౧౨౨ రామావతార ,,

౧౨౩ కృష్ణావతార ,,

౧౨౪ బుద్ధావతార ,,

౧౨౫ చైతన్యావతార ,,

౧౨౬ కల్క్యావతార ,,

౧౨౭ గోవింద ,,



సంకీర్తనామృతము 0-2-0

(ఇందు నామసంకీర్తనమువలన గలుగు ఫలితములు, చేయుపద్ధతులు చెప్పబడినవి.)

నగరసంకీర్తనము 0-2-0

(ఇందు నృత్యము, వేషము, భాష, నగరసంకీర్తన పద్ధతి, భారతదేశ స్త్రీల భక్తితాత్పర్యములు, 126 నామములు చెప్పబడినవి.)

భక్తగౌరాంగ్ 0-4-0

(చైతన్యావతారము సంక్షిప్తముగా నాటకరూపముగా వ్రాయబడినది.)

భక్తత్యాగరాజు 0-4-0

(త్యాగరాజువారిచరిత్ర నాటకరూపముగా వ్రాయబడినది.)

---

# రాబోవు గ్రంథములు.

శ్రీకృష్ణ చైతన్యావతారము— బాలకాండము, యౌవన కాండము, అవతార ప్రదర్శన కాండము, సంకీర్తన కాండము, సన్యాసయోగకాండము, యోగకాండము, నిర్యాణకాండము.

గీతామృతము—కర్మకాండము, సంకీర్తనకాండము, జ్ఞాన కాండము.

భగవత్ప్రార్థనములు—

శ్రీ

# బాలబ్రహ్మానందరత్నములు.

ప్రథమభాగము

—: అక్షేపణపత్రిక :—

బ్రహ్మశ్రీ కొమ్మూరి బాలబ్రహ్మానందదాసుగారిచే
రచియింపబడిన గ్రంథములయందు

## పండా సూర్యారావుగారిచే

సంకలితము.



మొదటి కూర్పు 1000

రాజమండ్రి కందుల సూర్యారావు బ్రదర్స్ వారి
రామమోహన ముద్రాక్షరశాలయందు
ముద్రితము.

1934



వెల 0-2-0

[illegible]

శ్రీరస్తు.

# బాలబ్రహ్మానందరత్నములు



## —: దైవప్రార్థనము. :—

ఉ. లోకులలోటులన్ని తనలోటులుగామదినెంచి సర్వదా
లోకులఁగాచి భక్తులకులోనయి సేవలొనర్చుచుండు నా
గోకులపాలు నేమతివకూళలునాకమందకుందురే
శ్రీకరుపాదపూజనముఁజేయనిజన్మము జన్మమే ధరన్

చ. కడుపునఁబిండమైనపుడుకన్గొనిజీవనమిచ్చిప్రోఁచి దుం
దుకుకుదనంపుబాల్యమునదోడయి దేహముబెంపుజేయుచు
న్గొడుకులఁగాంచిపెంచుతతిఁగోవిదతన్ దయచేసి వృద్ధుఁడై
మడిసెడుదాఁక మానవునిమన్చెడు రక్షకు నెంచికొల్చెదన్.

## —• వేడుకోలు. •—

చ. పరమశివుండులేని దొకభాగములేదఁటవాది యెందునన్
బరులకుఁజేయఁగావలెఁగృపామతిసాయమునెప్పుడున్ సరా
సరిగనెమాటలాడవలెసత్యముఁదప్పక హానిఁజేయరా
దొరులకు నాసపీడవలె నోరిమిఁబెద్దలఁగొల్వఁగావలెన్

చ. జనకుఁడవీవు సర్వజనసంతతి బిడ్డలునీకుఁ బూరుషుల్
వనితలు రెండుజాతులగు వారలవారలవృత్తిధర్మమున్
గని యితఁ డీకెడఁదుకు ఘనత్వమునందఁగోరువారెగా
ఘనమగుజాతియిద్ది యిది కాదనువారలుఁబెద్దలేశివా!

తే. చిలుకలనుబచ్చగా నెమళ్ళులవిచిత్ర
వర్ణములుగాగ హంసల స్ఫటికరీతి
నల్లగాఁగాకులను జేసినావు నీదు
మహిమవర్ణింపదరమె సాంబా! మహేశ!

—♦ వి న్న ప ము. ♦—

ఉ. పండితలోకమం దణువువంటిడ నేనియుఁగాను చూడ నే
ఖండమువోయిమారఁదగుగట్టిసమర్థులు మీరొక్కరున్
మొండితనంబుచేతఁదమముందరనిల్చితినేదొ చెప్పఁగా
పండితులార! నన్నుదయఁబాలనసేయుఁడు బిడ్డరీతిగన్.

—♦ క ష్ట ము. ♦—

ఉ. కాచినచెట్లకేతగులు గాదెతలంపఁగఱాతిదెబ్బ ల
ట్లే చవిగల్గువిద్యగలయెవ్వనికేనియుఁజూడ లేశముల్
దోచును కష్టమబ్బు నతిదూరము యోజనచేయబోకఁయే!
నీచులుగేలిసేయుదురు నిందితులౌదురె యోగ్యులంతలోన్.

—♦ మ ర్జ న త్వ ము. ♦—

మ. అపరంజి న్నిరసించుదుర్జనులు లోహంబేఘనఁబంటకై
యపరంజిందగుమోతలేదు జను లత్యంతప్రమోహాత్ములై
కృపణత్వంబునుగొందు రద్దిగలుగం గీడంచునిందింతు రా
యపరంజిన్బ్రతిభావిశేషములుగోప్యంబౌనెసుం తేనియున్

—♦ ఏ డ్పు. ♦—

ఉ. బాలురువిద్యనేర్చిప్రతిభన్గొనుచున్నపు డోర్వలేమిచేఁ
గూళలు తిండిమానుకొని కొంపలఁజేరక యెట్టులేనియా

బాలురపూనికన్ దెరపి భ్రష్టులఁ జేయఁగనెంత్రు గానియే
కూళలెటేడ్చి చెన్నరకకొందు రయోగ్యులు దేవుఁడోర్చునే.

—♦ ఉత్తమసతి ♦—

మ. పతితిన్నంతకుఁ దానునుండిక నాఁప్రాణేశుఁడెందేగనో
వెతఁజెందెన్ మనమంచు నూరగల దేబెంబోలు నాభర్తకున్
మతిపోఁజూచి పదంబులొత్తి కడుఁబ్రేమం జేసి కాపాడి సం
తతము న్నొకరుపోలెఁ గష్టపడు కాంతం బ్రస్తుతింపం దగున్.

ఉ. ఏకశరీరమై విభుని కెంతయు సౌఖ్యము గూర్చుచున్ సదా
శోకముదంబుల న్సమతఁ జూచుచునై గృహకృత్యమెల్ల న
న్యాకులచిత్తగాక తనదంచు ముదంబునఁ జూచుకొంచు ల
క్ష్మీకరయోగ్యఁగైకొనిన చెల్వుఁడె ధన్యుఁడుగాఁడె యుద్ధరన్.

—♦ సత్పు. ♦—

మ. ధన మానంబులకంటె నెక్కుడుగ విద్యాసందన్ మించఁగా
దనుగన్నట్టిరు తల్లిదండ్రులకు మీఁదన్ స్వర్గతుల్యంబుగా
ఘనమౌ స్వర్ణముకంటె మోదముగ స్వీకారంబు చందంబుగా
గనునాత్మేశుని బ్రాణనాయకుఁ డనంగాఁ జెల్లదే యుద్ధరన్.

మ. వలపించుం గడుఁ గోపగించు నెడ నాశ్వాసించుఁ బ్రేమించుఁ బెం
దలభోంచేయుమటంచుఁ బ్రీతినను నిత్యంబున్ మనోదృష్టిచే
దిలకించందగు భుక్తికోసమయి యేదే నిచ్చి పోషించి పై
దలిఁ గాపాడెడు ప్రాణనాయకుఁడె కా! ధన్యుండనం జెల్లెడున్.

—♦ మప్పి. ♦—

చ. తెలియక యెప్పుడున్సతినిఁ దిట్టుచుఁ గొట్టుచు దానుమూర్ఖుఁడై
యలరెడువాని భార్యయయియాతని చెంతను క్రూరరూపియౌ
పులిదరిలేడిచందమున భీతవశంబగువ్యక్తి చొప్పునన్
మెలఁగుటకంటెకష్ట మిఁక మేదినిలేదుగదా! తలంపఁగన్.

—♦ దుష్టుఁడు ♦—

ఉ. త్రాఁగును జూడమాఁడు బరదారలకై కడునాసచేయ నా
నోఁగులఁగూడు సజ్జనులనొప్పక యెప్పుడుఁదూలనాడు వా
డాగముసేయుసత్సభల నాలిని బాధలఁబెట్టుఁ బేదలం
దాఁగని తిట్టుదొంగయయిదారులుగొట్టునుదుష్టుఁడెప్పుడున్.

—♦ ఉత్తముఁడు ♦—

చ. తనవలెఁగాంచు నెల్లరిని తల్లికిదండ్రికిఁబూజసేయు బే
దనుగనియాదరించు నిజదారను ప్రాణముగాఁజూచు దు
ర్జనులను జేరఁబోఁడు చెడుసల్పఁడు నింద లొసర్పఁడేరినిన్
బనివడి యుత్తముండుసలుపందగు నెప్పుడుమంచికార్యముల్

—♦ దుష్టసతి ♦—

ఉ. చెప్పెడుమాటలన్వినక సిగ్గునట్టిదెఱుంగబోక యే
తప్పునులేకయే పతినిఁదల్లడపెట్టుటకేడ్చుచు న్మదిం
గప్పుచు నెల్లవారలనుఁగాదనుచుం బసివారిఁగొట్టుచున్
ముప్పుకుమూలమైన సతిఁబొందునుమించినకష్టమున్నదే.
తే. భయము వీడి గయ్యాళిగంపై చెలంగు
చలవిగానిగొంతెమ్మకోర్కులనుఁ సతము

గోరుచున్ భర్తయెముకలఁగొరుకుచుండు
బంధురండలు చచ్చినన్ బాధలేదు.

—♦ దైవవశము ♦—

ఆ. శివునియాజ్ఞలేక జీమయైనంగుట్ట
దనెడువాక్యమగును ఘనము తలఁప
మీఁదినుండిప్రాకిపోదెపామైనను
మనుజునకు సుకర్మదనరినపుడు.

తే. చెడ్డశకునంబువచ్చుటన్ జెడదుకార్య
మిటులఁజరుగు నీపనియని యెఱుకఁజెప్పు
నింతకును దైవహేతువ దెట్లుకలదో
దానిగడువలేడెట్టియుత్తముఁడు గాని.

తే. కాఁదగినకార్యములు కొన్నికాకయుండు
కావనెడికార్యములుఁ గొన్నికాఁ గలుగును
దైవకృపవల్ల నేని కాతఁడు వెడఁగని
యన్యులాడుటదోషంబెయగును కాదె.

చ. వినఁడొక పేదవానినుడి విశ్వమునేనియు గేలిసేయు దా
కన డొకధర్మమార్గమును కన్నగుణాఢ్యులదిట్టుచుండు నే
పనియగుశాస్త్రచింత నను బంధులనేనియు దూలనాడున
ల్పునకుధనంబుగల్గునెడ బుండులభించినయోగనాఁజనున్.

—♦ దరిద్రము. ♦—

ఉ. భార్యకురోత బంధులక భావము దూరమగున్ యశంబు వి
ద్వద్యుడెయైననున్ జనులు పామరుగాగణియింత్రుపూని కానే

కార్యమునందు బాల్పడినఁగష్టముదప్ప ఫలంబు గానరా
దార్య! సరస్వతీప్రియుడ వైనను దరిద్రముతోడనుండినన్.

—♦ ఋ ణ బా ధ. ♦—

ఉ. ఆకలి వేయనీదు పరిహాసకుఁడైనను వానినట్లుగా
వాకొననీదు ప్రీతిపర భామినిపైని స్వభార్యయందునున్
దాకఁగనీదు సత్యమును ధైర్యమునున్ జొరనీదనంతమా
వ్యాకులత ఘటించుఁబ్రతివానికిల నృణమన్న మృత్యువే.

—♦ భా ర్య. ♦—

ఆ. భార్య స్వర్గలోకపదమా నొకప్పుడా
భార్యయానునకరపద మొకప్పు
దుర్జనునకు ధనికి దోర్బలునకు సుస్వ
భావునకును బ్రహ్మదేవునకును.

—♦ వ్య తి రే క ము. ♦—

మ. ధనకాంక్షాపరుడైనవానికిల మాతాపుత్రులే శాత్రవుల్
ఘనకామాంధునకెగ్గుసిగ్గులునుయుక్తాయుక్తయుల్ దూరమా
గొనబావిద్యను నేర్చువానికనురక్తుల్ సౌఖ్యముల్కానవా
విన క్షుద్బాధకుడైనవానికి రుచుల్ భేదింపరా వెప్పుడున్.

తే. ఆసధనమందుగలవానిఁ కరులు గురులు
కామి కెగ్గుసిగ్గులుశత్రుకారణములు
విద్యగోరెడువానినివిడుచుసుఖము
లాఁకటికిఁజూడఁ బచ్చిపు ల్సమృతమగును.

—♦ బ్రతుకు ♦—

చ. అనృతమునాడఁగానలుపు నర్థము నేనియు వీడఁజేయు నీ
చునినిమహాత్ముఁడన్నలుకుఁజోద్యముగాఁబలికించు స్వీయకాం
తనునిరసించుఁ గోఁచిసహితంబును బెట్టిచరింపనిచ్చునే
మనకశరీరముం జెడినమానెయనున్ బ్రదుకెంతతీపియో.

—♦ గర్వము ♦—

మ. గరువంబందగరాదుమానవుఁడకెక్కాలంబుహాదా ప్రభా
కరుఁడన్నెననునొక్కఁడింకొకరుడేకందర్పుడన్వేఱొకం
డురుదానంబునఁగర్ణుడేననెడు నిట్లూహించియే స్వర్గమే
గిరి కర్ణుండునుగీచకుండుమఱిభోగీంద్రుండురారాజునున్.

—♦ సంపదంధుఁడు ♦—

తే. సంపదంధుఁడు సూదిబెజ్జంబులోన
నేన్గదూరుటవంటిదే యెరుగుటహరి
నట్టివానిఁ దరిద్రమేయంకురింప
నరసునం దేన్గచరియించు సరణిగాదె.

—♦ జాగ్రత ♦—

ఉ. మాయలుమాఱుమాటలునుమచ్చరముల్వ్యభిచారచోరత
ల్చేయనిపూరుషావళియుస్త్రీలునునూటికిఁగోటికైన యీ
మాయలమారికాలమునమత్తిలి వ్యక్తతనుండమేని య
న్యాయముగాఁబయింబడును నష్టముగష్టమునిష్టురంబునున్.

—♦ యశము ♦—

తే. ప్రేమవాక్యంబులంగూడు పెట్టుఁబోత
గర్వవర్జితమౌ జ్ఞానగరిమ మఱియు
నోరుపునుగూడియున్నట్టి పౌరుషంబు
విద్యతోగూడినధనంబు సద్యశమిదు

—♦ భ్రమ ♦—

తే. శబ్దమునబాము స్పర్శను చమరమృగము
రూపమున గీటకమ్మును జేప రసము
చేత భ్రమరము గంధముచేత మోస
పోవుచుండెడు నిదియెస్వాభావికంబు

—♦ బాగు ♦—

తే. రత్నములుముత్యములుదీయఁ బ్రాణములను
లెక్కసేయక సంద్రము పెక్కుమంది
చొచ్చిచూచినయట్టుల సూరిజనులు
కష్టములకోర్చిశ్రీహరి కరుణగొంద్రు

—♦ మనుష్య యత్నము ♦—

మ. కరవాలంబులు మందుగుండులును వీకంబోరు సేనానులున్
గరులున్ వాజులు యుద్ధవాద్యములు రథౌఘంబు సేనాదళం
బురుబాహాబలవిక్రమక్రత ధన్యుండైన రాజుంబ్రధా
నిరణంబందున లేకయుండ జయమౌనే దైవమున్న మ్మినన్

—• మేలు •—

తే. ప్రీతిచేకోపమును మంచిచేతచెడుగు
దానమునను లోభంబును జ్ఞానదృష్టి
మోహమును నసత్యము సత్యమునను గెలువ
నగుననెడుమాట నిశ్చయం బగునుజగతి

—• ఆ ధి క్య త •—

తే. శూలియేనిభక్తులపాదధూళిబూజ
సేయునేనన నెంతవచింపదలప
భక్తులకుపతివ్రతలకుం బరమశివుడు
భృత్యుడయియుండు నెప్పుడున్ నిత్యుడయ్యు

తే. ఉండ రేయుత్తములునూటికొక్కరైన
కోటికొక్కపతివ్రతకూడ లేవె
కలియుగంబునన్నైనను గానివినుము
ధర్మముండకలోకముల్ తగులబడవె

—: య శ ము :—

గీ. చందురునిచేతనిశికాంతి బొందుచుండు
మంచిజలముననది ప్రకాశించుచుండు
నీతిచేరాజుకీర్తితోనెగడ బడును
శాస్త్రచింతనబుద్ధివిశాలమగును

—: నై వి క ము :—

శా. ఏనాడెచ్చటికేగగావలయునో యేచోటనిద్రింపగా
నౌనో భోజనమేడనో హితులు నెందావారలోయెవ్వరో

దానంబీయగనానో పట్టుటకునై దారిద్ర్యమే యబ్బునో
దానిం జెప్పగశక్యమా నెవినుమేతన్మాత్రసందేహమున్.

గీ. క్షణముక్షణమునుజిత్తంబు చలనమగును
గడియగడియకుమాఱును గాలరీతి
దినదినంబునుబోవును దివ్యమహిమ
తరణిమైననుకర్మంబు దాటగలడె.

—♦ ఆ స. ♦—

తే. చెవులు కన్నులు వెంట్రుకల్ జీర్ణమగును
చేతులును కాళ్లునుదరముం జేవజెడును
బుద్ధిమాంద్యము బోడనూపు ముసలివాని
కధికమగుచుండు ధనమునం దాసతము.

—♦ కా మి. ♦—

తే. సర్వరక్షకుడేగాని సాధుగాని
తేజమునదేశములనేలు రాజుగాని
బ్రహ్మఋషినిగావలెనను వాడుగాని
పాశబద్ధుడుకాకున్న పడతివగల.

—: ప్రి య త్న ము. :—

తే. కృషిసలుపువానికెట్లు దుర్భిక్షమగును
జపిదరినిబాపమెట్టుల సంచరించు
మానిపైనేరుశత్రుత్వ మూనగలరు
భయపడగనేల జాగ్రత్త పడెనువాడు.

—• పతివ్రత. •—

గీ. సతిసుగుణవంతురాలైన చపలమతులు
దుష్టబుద్ధితోనున్నను దోసమేమి
దివ్వెదిననున్న క్రిమి కడ తేరుఁగాని
జ్యోతికెన్నటికిన్ జేటు జూడనగునె.

—: మాల. :—

సీ. పెద్దవాఁడనుపేరఁ బెంపొందియుంగూడ
పరునిసంపద కేడ్చు వాఁడుమాల
మొదటస్నేహముఁజేసి పిదపవానినిఁజెడ్డ
వాఁడంచుఁదెగడెడు వాఁడుమాల
యగ్నిసాక్షిగగొన్న యర్ధాంగినెడబాసి
పరభామఁగూడెడు వాఁడుమాల
యప్పుతెచ్చినసొమ్ము మప్పితంబుగతిని
వారలకెగవేయు వాఁడుమాల
గీ. భక్తులంగష్టపెట్టెడు వాఁడుమాల
పరులతప్పులనెంచెడు వాఁడుమాల
ప్రాణిహింసలంజేసెడు వాఁడుమాల
మాలకులుఁడైమాత్రన మాలయగునె.
సీ. అస్పృశ్యతారోగ మంతరింపఁకజనుల్
స్వేచ్ఛావిహారతన్ జేయలేరు
ననుముట్టుకొనబోకు మనుమాటమాన కా
మనసునిశ్చలమైన దనఁగరాదు

హరిజనుల్ మనవార లనకయుండినవారు
సంఘబాహుళ్యమున్ సలుపలేరు
అంటరానితనంబు నణచివైవకయున్న
వ్యక్తిత్వమున నేని ఫలములేదు
గీ. మాలయనసర్వసద్గుణ మాలమఱియు
రక్షణముఁజేయునట్టి రుద్రాక్షమాల
మాలయనియెడు కులమిల మాలయగునె
మాధ్యహరణమౌ స్ఫటికపుమాలకాని.

—: పురవర్ణన. :—

సీ. సత్యంబు దప్పక సంచరించుటను బు
ణ్యంబు సంపాదించునట్టి వారు
దైవంబుననిశంబు ధ్యానించి యాతని
కరుణ సంపాదింపఁ గలుగువారు
భర్తలపాదముల్ భక్తితో బూజించి
తమవారి స్వర్గంబు దార్చువారు
అన్నవస్త్రాది దానాధికంబుల జేసి
మోదవారిధిలోన మునుఁగువారు
గీ. ధర్మయుద్ధంబులం జేయఁదలఁచువారు
యజ్ఞయాగాదులం జేయునట్టివారు
గలిగి భోగభాగ్యోన్నతి నలరియుండు
నాపురంబు శ్రీదేవికిఁ గాపురంబు.

సీ. ఏపాఠశాలల కేగి వీక్షించినఁ
సత్యంబు నెన్ను పుస్తకము లేదు
ఏజాతివారిని నెవ్వఁడు శోధించిన
ధర్మం చర యటన్న తలఁపులేదు
ఏకాంత దఱికేగి యేది మోక్షమటన్న
బతిసేవ మోక్ష మన్మాటయేను
ఏబాలకుఁగని నీదే తలంపనినఁ బ
రోపకారంబను నూహయేను

గీ. విరివిగానూరభజన మందిరము లేదు
నాడునేడనకన్నదానంబు లేదు
కాంచదగునాపురంబు బంగారుగాను

—: విద్య. :—

క. బహు జనపరిచయ భాగ్యం
బిహపరసౌఖ్యంబు నత మహీనముదంబుఁ
రహినిండు కీర్తినిడియెడు
నహహావిద్యకును సాటియా ధనమెంచఁ

చ. సతులకు ప్రేమగల్గుగుణసాంద్రులకాదయకల్గుపెక్కుభూ
పతులకు నాసకల్గు కడు బాపికినైనను భీతి కల్గు శ్రీ
పతికి ముదంబు గల్గు తనబాలురకేనియు భక్తికల్గు నా
తతముగ విద్య చేకురినధన్యుడు ధన్యుఁడుగాదె యెంచగన్.

చ. పరువుగలట్టివాను తనబంధులకెల్లను గీర్తిఁదెచ్చు శ్రీ
వరుకృపగాంచనెంచు నృపవర్యులమన్ననలందు నెల్లచో

ట్లరమరలేక జూడనగు నార్యులవ్యక్తి గ్రహింపనేర్చు వి
ద్వరునకు సాటివేఱొకడు వచ్చునె తెచ్చునెకీర్తికన్యకన్.

ఉ. భేద్యముఁగాదు శత్రులకు పింపురువట్ట దదెట్టి వారికిన్
హృద్యతఁగూర్చు మానవుని హీనతబాపును కీర్తివంతమై
సద్యశమిచ్చు భుక్తికి సుసాధ్యము దృప్తికి నాలవాలమా
విద్యకు సాటియే! ధనము వేయివిధంబుల నెంచిచూచినన్.

తే. ప్రజ్ఞచదువున వచ్చునా ప్రజ్ఞవలన
సౌఖ్యమబ్బు నావెన్కయే సరసతయును
గలుగు జయమగు దాననే కార్యమైన
నప్డు సంపదల్ గల్గు పూజ్యతయు హెచ్చు.

—: సూ రి జ న ల క్ష ణ ము. :—

సీ. ఇనుమునయస్కాంత మెట్లులాగునో యట్లు
భగవంతుని న్లాగుభక్తునిమది
భక్తితోఁబెట్టిన పచ్చడన్నంబేని
భక్ష్యంబుల న్మించి పరిఢవిల్లు
సర్వజీవులు తనసములటంచనువాడు
వేదవిధిజ్ఞుని పిత్రుసముండు
సజ్జనసాంగత్య సరణి పెరుగునుమ
ధ్యాన్నంబు పెరిగెడి వన్నియవలె

తే. తల్లిదండ్రులకంటెను తన్వికంటె
సుతులకంటె బ్రాణముకంటె సొమ్ముకంటె

వేమదుంగులు స్నేహంపు ప్రేమ మెండు
సఖునిమించు పదార్థ మీజగతిఁగలదె.

—: త్రాగుడు. :—

ఆ. గుండెకాయలఁదిను నుండనీయదుస్మృతి
మఱగినట్టివానిమానిపోదు
మంచిశ్రద్ధలేమి మదిసుండగానీదు
ధనహరణము సురను ద్రావఁదగునె

కం. నోరెల్లవాసనయు గం
గారునుమొరఘప్రేతకళ వాగుడు ని
స్సారత మత్తును గొలిపెడు
సారాకల్లులను ద్రావసంతసమగునే

—: జాతి :—

తే. సత్వగుణమేప్రధానంబుజాతియేది
యైననేమిబ్రాహ్మణుఁడు గల్గారగింప
నుత్తురాదె పంచముడు బ్రాహ్మణునిఁబోలె
ఫలము లందిన నఱుగవే ప్రాజ్ఞులార

—: నృత్యము. :—

శా. రాయంచల్ గనిసిగ్గునొందగమయూరంబుల్ తలల్ వంపగా
గాయంబంతయువాడకుండ ముఖలక్ష్మ్యర్థంబులే మాఱగా
జేయింజేయియుఁగల్పుచున్ విడుచుచున్ జేదోడువాదోడుగా
గేయంబుల్ వినుపించుచాడి రతిరక్తిన్ స్వర్గవారాంగనల్.

—: నీ చ వే శ్య లు :—

సీ. పిన్నపెద్దలతాహ తెన్నకెల్లరనాడు
మోటుమాటలు తోడబుట్టువుమాకు
దమ్మిడి చే లేక డంబముల్ గొట్టెడు
డ్రాగుఁబోతులు స్నేహితాళిమాకు
మంచివానిని సేనమర్యాదగాఁజూడ
బ్రాందిసారా లుగ్గు బాలుమాకు
నెంతవారల్ వీధి నేగుచున్నంగాని
యరుగులే కూర్చుంచు తెరవుమాకు

గీ. సరసుఁ దిట్టులే సరసపు సరణిమాకు
పేక వీధిలోనాడుటే ఠీకుమాకు
చుట్టలంగడు లేరచ్చపట్టుమాకు
ప్రబల రోగంబులే పాడిపంట మాకు

—: భుక్తి. :—

సీ. భార్యబిడ్డలవీడి బత్తెంబుగైకొని
వసియించుసంద్రాన బల్లెకులుఁడు
పెండట్టులెత్తుగా పెరిగినచెట్లైన
కల్లునకై యెక్కు గాళకులుఁడు
బొడ్డుక్రిందన్ గడ బోటుగానొనరించి
మడుకులేకందిర్గు దొమ్మరిసతి
ప్రాణహత్యయటంచు పరికించగాఁబోవ
కం జీవములజంపు కటికివాడు

తే. గీ. పొట్టకూటికి యోజింప ముఖ్యమద్ది
దానినార్జింపఁబోనియేమానవుఁడును
వసుధవ్యర్థుడేగద యెట్టిపండితుడును
యెన్నికర్మలకేని యు నిదియెకతము.

సీ. పంచాంగమునుచేతఁ బట్టిచెంబుధరించి
యాచింపఁదలకొను నవనిసురుఁడు
క్రూరమంచెంచక కోరికయ్యములాడి
సరిరాజులంజంపు క్షత్రియుండు
ధరనబద్ధము జెప్ప దప్పని తెలిసియు
వాణిజ్యముంజేయు వైశ్యజనుఁడు
పవలురాత్రియనక వ్యవసాయముంజేసి
సుఖమన్నదెఱుగని శూద్రకులుఁడు.

తే. కడుపుకూటికికదయట్లు కష్టపడుట
దానికేగాదెజనములు తల్లడిలుట
క్రూరకర్మసుకర్మముం గూటికొరకె
కడుపుకూటికిగడిపిన ఘనుడెఘనుడు

—: ఆకలి బాధ. :—

చ. కలఁచినయట్టులొఁగడుపుఁగాయముసోలును మాటరాదుక
న్నులుఁబడుమూఁతలేపనియునున్మదిదోఁచదునోరునాఁటెడున్

అలుకజనించు నంత నడయాడఁగఁ గాళులులాగునీరసం
బలవడునెట్టిదిట్టకును నాఁకలిబాధ భరింపశక్యమే.

—: మో హ ము. :—

ఉ. స్వర్గము స్వర్గమం చకట చత్తురుమూర్ఖులుబుద్ధిలేక సం
సర్గమె యిట్టిపూరుషుని సందిటనుండఁగఁగల్గనే నదే
స్వర్గముగాక వేఱెయొక స్వర్గముముఖ్యమె కాంతకక్కటా
దుర్గతి యిట్టిపూరుషునితో గలియం జనకుండుమేగదా?

—: పు రు ష వ ర్ణ న ము. :—

ఉ. వీనియొయారపున్నడలు వీని సగర్వపు రాజకీవి మ్మో
తో నయమొప్పువీని కనుదోయివిశాలమువీనిఱొమ్ముకెం
పూనినవీనిగ్రొంబెదవి ముద్దులుగుల్కెడు వీనిమీసముల్
జానలశీలతం జెరుప సంభవమయ్యెనొకో తలంపఁగా.

తే. మాటమాటకుఁదేనియ లూటలూరుఁ
బాటఁబాడిన నమృతంబు ప్రాఁకుదిశలఁ
జక్కఁగావీఁడుచూచినఁ జాన కోడలు
చెమ్మటమదనుని జ్వరముచేతఁ బొడము.

—: కూ డ ని వి :—

క. బాలార్కునెండయును శవ
మూలంబగు పొగయుఁగలియ ముసలివనితయున్

నీలాడఁ గుంట నీరును
చాలన్ దోషంబు కాదె జనులకుఁజగతిన్

—: కూ డు న వి :—

క. జరఠార్క నెండయును న
ధ్వరధూమముకలియఁబోఁవపడుడుచువనితయున్
ఝురవాఃఱునదులుమునుఁ గగఁ
బరమోత్తమమనుచు మునులుఁ బల్కుదురుగదా

—: సం తా న ము. :—

సీ. సంతతిలేదని చింతించువారికిఁ
గొడుకులుకలిగినఁ గుడుముదంబు
లేకయుండకకూఁతు రేకల్గినన్గైన
వానికష్టముఁదెల్ప వశమెసతము
కూఁతునకేకర్మ చేశనైన న్లోటు
కలిగినవియ్యంబుఁ గల్గుటరుదు
లోటులేకున్నను నీకైనసంబంధ
మెటులభించునోయటం చేడ్వవలయు
తే. నది తటస్థమెయైనను నల్లునిదటిఁ
భయముతోఁడ మెలంగుట వలయుఁబిదప
పంపతులుప్రీతినుండరా తనకె భీతి
కూఁతురులఁగనువారల వ్రాఁతచేటు.

ఆ. యోగ్యమైనపుత్రభాగ్యముకంటెను
ధరణిలోననుండఁ దగినదేది
రెండవ విధముగను నుండె నేనియుఁ దండ్రి
గుండెనగ్గికుంప టుండునస్లె.

—: ప్రేమ. :—

శా. రార మ్మోమవర రాజపుత్ర సుకుమారాధీర శూరాధిపా
రారా నామనమార మారసమసారా ప్రాజ్ఞనే నీకువేర్
గారాకాంత సరోజలోచన సువక్త్రా రాజరాజేశ్వరా
రారా నావెతదీర్పరా పలుకవేరా యొక్కముగ్గియరా.

—: కర్మ. :—

సీ. కౌసికుపనిఁ గలగాంచి హరిశ్చంద్రు
డేపాటిజాగ్రత్త నెఱిగినడచె
జూదమాడినకీడు జూపట్టుటమెఱింగి
నలచక్రవర్తి యెట్టుల నటించె
మాయామృగమని లక్ష్మణుఁడు చెప్పగ విని
శ్రీరాముడేపాటి చింతజేసె
జ్యోతిషగ్రంథముల్ చదివి పరిక్షిత్తుఁ
డేపాటికాలమిాయిలను మనియె

తే. నలఁతివానికే నిన్మతి యజునికేని
తప్పనే పూర్వకర్మము లెప్పటికిని
ననుభవింపక కించిజ్ఞులైనవారు
తమకృతంబన్నిపనులని తలచుచుంద్రు.

గీ. కష్టసుఖములు కావటి కడవలగుట
తప్పదెవ్వనికైనను తథ్యమిద్ది
జన్మలోనాల్గుమారులు శనినిగనక
పూర్ణమాయువయోవంతుడు పోవునెట్లు.

—♦ ధనము ♦—

చ. ఘనతనుగూర్చునీచుని కఖండసుఖంబొనగూర్చు రోగికిన్
బనుచునుస్వర్గమేని గడుపాపిని బంటునురాజుజేయు వం
ద్యునిగనొనర్చుదుష్టునివయోయుతుజేయునువృద్ధునేనియున్
ధనమెప్రధానమై జనని దాండవమాడఁగజేయు నిచ్చమై

చ. వినుతులొనర్తుసత్కవులు వీనులవిందొనరింత్రు గాయకుల్
పనివడిపిల్తుభూపతులు బంధువులాదరణంబొనర్తు దు
ర్జనులునులొంగియుండుదురుశత్రువులైనను ద్రవ్యమున్న చో
ధనమె ప్రధానమై జననిదాండవ మాడగజేయునిచ్చమై.

చ. వినగనరాని నీచుని త్రివిష్టపనాథునిఁ జేయు నష్టరా
గునకును యౌవనంబునమకూరఁగఁజేసెడు నెన్నఁడేనిఁదా
కనివినియుండనట్టిసభకా యధికారము దెచ్చియిచ్చెడున్
ధనమెప్రధానమైజనునిఁ దాండవమాడఁగజేయునిచ్చమై

చ. ధనమునకై సతీసుతులుఁ దల్లియుఁ దండ్రియునంటియుందురా
ధనమునకే బ్రధానులును దాంత్రికులాద్యులునంటియుందురా
ధనముననే పురోహితులు ద్రవ్యవిహీనులు నంటియుండుటల్
ధనమె ప్రధానమై జనునిఁ దాండవమాడఁగ జేయునిచ్చమై.

చ. ధనికుఁడు సత్రమేర్పరుచు దానములెన్నిటి నేనిఁ జేయునా
ధనికుఁడె ప్రోఁచుఁ గోవులను ద్రవ్యవిహీనుల బుద్ధిపుట్టుచో
ధనికుఁడె యోర్చు విందులను దబ్బున జేయునదెట్టి కార్యమున్
ధనమె ప్రధానమై జనునిఁ దాండవమాడఁగఁ జేయునిచ్చమై

—: ఘ నా ఘ న ము లు :—

ఆ. ఈవు దొడ్డవన్న నెవ్వాని కేనియున్
స్వర్గమఱిగినంత సంతసంబు
నీవు చెడ్డవన్న నెవ్వాని కేనియు
న్నలుక మఱిగినంత కలుగుఁ దనము

—: న ర క ము :—

తప్పుగల్గువానిఁ దనవాఁడె యంచునా
తప్పుఁ గప్పు యముఁడుఁ దన్నుఁ గొట్టుఁ
దప్పులేనివానిఁ దనవాఁడు కాఁడని
తప్పులెన్నుఁ గర్మ తన్నుగొట్టు

—: త ప్పు :—

ఆ. ఎఱుఁగనట్టిఁ డేనిహీనకులుండేని
గర్భశత్రువైన ఖలుఁడయేని

తనగృహంబుఁజేరఁ దా నాదరింపని
తప్పుకంటె గొప్పతప్పుగలదె.

—: జవ్వని. :—

సీ. గడియకునొక దుస్తుఁగట్టి విప్పుచునుండు
మాటిమాటికిఁ బూలుమార్చి ముడుచు
బసపుకుంకుములను పసచెడినదో యని
యద్దమున్ మఱిమఱియరయుచుండు
దొండపండుల మించియుండు పెదవులకుఁ
దగులరంగు మఱింత తాల్చుచుండు
దేపతేపకు నగల్ తీసి మార్చుచునుండు
పరిమళద్రవ్యముల్ వాడుచుండుఁ
ఆ. జెక్కుచెదరకుండ సింగారముం జేయుఁ
దన్నుఁజూచుకొంచుఁ దానె పొంగు
చిలుక జతల జతలచిరుగోరువంకలఁ
బెంచివాని ప్రేమ ప్రేమఁగాంచు.
ఆ. శశినిఁ గాంచి కల్వసంతసమందుచో
కాంచికాంచిలోనఁ గలఁగు చేలు
తరణిఁ జూచి విచ్చుతమ్మి పూవుంగని
చూచి చూచి సోలుచుండుఁ బవలు.

—• పరోపకారము. •—

తే. వృక్షముల్ ఫలించును ప్రజారక్షణకయి
పసులు జనులపోషణకయి ప్రసవమందు

నదులు జనరక్షణార్థమై పొదలుచుండు
వసుధఁ బరరక్షణ నిమించుఫలముఁ గలదె.

—♦ నిర్భయ సమయము. ♦—

ఉ. చిత్తము దేనియందయినఁ జేరిసతంబుఁ దపించునేని యా
తత్తరపాటుచేతనగు ధైర్యము జెప్పఁగ శేషుఁడోర్చునే
కుత్తుకవోవనోర్తు భీతిలకుండ దదేభయకార్యమేనియున్
బొత్తిగసందియం పడరుమూలముచేకురుదాక మానవుల్.

—♦ ఎంతకంత. ♦—

తే. పరమశివుఁడుండు సర్వప్రపంచమందు
ననెడి మాటలా మెవరెఱుంగనివి తలఁపఁ
భక్తిఁదను గొల్చువారిని రక్తిఁ బ్రోచు
గాని కష్టంబుఁ బొందక కలదె ఫలము.

క. తనయం దెంతటి భక్తిని
మన ముందుమొ యాతఁ డంతమంచిగఁ జూచున్
మనలోన లేడె శివుఁడని
యనుకొను జనములను తానునట్లే కనెడున్.

శ్రీ. శ్రీ. శ్రీ.



రామమోహన ముద్రాక్షరశాల, రాజమండ్రి —1934.

శ్రీ బాలబ్రహ్మానంద దాసుగారిచే రచింపఁబడి

త్వరలో అచ్చగుచున్న గ్రంథములు.

## భీమార్జునగర్వభంగము.

చాల ప్రచారములోనున్న హరికథ.

---

## నందనార్ చరిత్రము.

పరమ భక్తాగ్రేసరుఁడగు మాలయోగి

భక్తిరసపూరితమగు హరికథ.

వలయువారు :—

ముందే తమ ఆర్డరును పంపుఁడు.

అడ్రసు :—

బ్ర॥ కొమ్మూరి బాలబ్రహ్మానందదాసుగారు

మొరక వీధి,

రాజమండ్రి, (తూ॥ గోదావరిజిల్లా.)

20



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B117 |
| పుస్తకం పేరు | సంకీర్తనామృతము |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 91 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | (1) 29, 31, 34, 85 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Asco Info |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | S.Lakshmi |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |